Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 2 • 11-1-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## ఇంకా మెరుగుపడని వివేకా ఆరోగ్యం

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఇప్పటికీ అనారోగ్యం నుంచి పూర్తిగా కోలుకోలేకపోతున్నాడు. తుంటి దగ్గర ఎముక సమస్య ఆయన్ను బాగా బాధిస్తున్నది. లేచి నడవడం కష్టంగా వుంది. ఎక్కువ సేపు మంచం మీదనే గడపవలసి వస్తున్నది. ఆ దిగులుతో కాబోలు మనిషి బాగా నీరసించిపోయాడు. అమెరికాకు చెందిన సుప్రసిద్ధ వైద్యుడు నోరి దత్తాత్రేయుడు ఆయన్ను పరీక్షించి వెళ్లాడట. భయపడవలసిన అవసరం లేదని, మందులతో కోలుకొనే అవకాశం వుందని ధైర్యం చెప్పారట.

సంక్రాంతి సందర్భంగా జరిగే గాలిపటాల ఉత్సవంలో పాల్గొనడానికి నెల్లూరు రావాలని

కొరవ 14వ పేజీలో

# వేడివేడిగా రాష్ట్ర రాజకీయాలు!

తెలంగాణ ఇస్తారా, ఇవ్వరా? అఖిలపక్ష సమావేశం తర్వాత కేంద్ర హోంమంత్రి సుశీల్‌కుమార్ షిండే ఒక ప్రకటన చేస్తూ, నెల రోజుల లోపల ఏదో ఒక నిర్ణయం తీసుకొంటామన్నాడు. ఆ నిర్ణయం ఎట్లా వుంటుంది అన్నదే ఇప్పుడు రాజకీయ వర్గాలలో ఆసక్తి రేపుతున్న ప్రశ్న. తాము పెట్టుకొన్న గడువును పాటించడానికి కాంగ్రెస్ అధిష్టానం తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నది. ఈ వారంలోనే రెండుసార్లు కోర్ కమిటీ సమావేశమై ఈ విషయంపై చర్చ జరిపినట్లు చెప్తున్నారు. అందువల్ల హామీ ఇచ్చిన గడువుకు ఏదో ఒక నిర్ణయం వెలువడవచ్చునని అందరూ ఆశిస్తున్నారు.

ఆ నిర్ణయం ఎట్లా వుంటుందన్న ఊహలు జోరుగా సాగుతున్నాయి. అధికభాగం రాజకీయ పరిశీలకుల అంచనా – తెలంగాణ ఇవ్వకుండా తెలంగాణ అభివృద్ధి పేరుతో భారీ ప్యాకేజి ప్రకటన జరగవచ్చునని. తెలంగాణ ఇవ్వాలని మాకూ వుంది. కానీ రాష్ట్రంలోని రాజకీయ పార్టీల మధ్య ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదు. దేశ పరిస్థితులు కూడా అందుకు సహకరించడం లేదు. తెలంగాణ ప్రజల ఆకాంక్షలను గుర్తించి, ప్రస్తుతానికి ఆ ప్రాంతంలోని వెనుకబాటుతనాన్ని నిర్మూలించడానికి చట్టపరమైన ఏర్పాటు చేస్తున్నామనే ప్రకటన కేంద్రం నుంచి వెలువడవచ్చునని భావిస్తున్నారు.

టిఆర్‌ఎస్ అధినేత కెసిఆర్ ఈ పరిణామాన్ని ముందుగానే పసిగట్టినట్లు కన్పడుతున్నది. కేంద్రం తెలంగాణ ఇస్తుందన్న నమ్మకం ఆయనలో కన్పించడం లేదు. పైకి మాత్రం తనకు ఢిల్లీ నుంచి సంకేతాలు వస్తున్నట్లు చెప్తున్నాడు. తెలంగాణ రాకుంటే ఏమి చేయాలనేది పెద్ద ప్రశ్న. తెలంగాణ ప్రజలలో నూటికి తొంభై మంది ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుకొంటున్నారని అందరూ ఏకీభవిస్తున్నారు. అందువల్లనే అఖిలపక్ష సమావేశంలో ఏ రాజకీయ పార్టీ కూడా తెలంగాణ ఇవ్వవద్దని గట్టిగా చెప్పలేదు. కరడుగట్టిన సమైక్యవాదిగా పేరు తెచ్చుకొన్న గాదె వెంకట

కొరవ 14వ పేజీలో

# కోతలపై వాతలు

రాష్ట్ర ప్రభుత్వం విసురుతున్న విద్యుత్ చార్జీల పెంపకమనే బండల బరువు మోయడం సామాన్యులకే కాదు, సంపన్నులకు కూడా అలివయ్యేట్లు కన్పించడం లేదు. నాగరికతకు మొదటి చిహ్నం విద్యుత్. అభివృద్ధికి పునాది కూడా అదే. కానీ దురదృష్టవశాత్తు మన రాష్ట్రంలో విద్యుత్ రంగాన్ని అభివృద్ధి ఉపకరణంగా కాక, ఓట్లు తెచ్చి పెట్టే గారడీ పెట్టెగా చూడడం అలవాటై పోయింది. ఎన్టీ రామారావు ముఖ్యమంత్రి అయిన నాటి నుంచి విద్యుత్ ఒక రాజకీయ అంశంగా మారిపోయింది. వచ్చి పోయే ప్రతి ముఖ్యమంత్రీ ఈ రంగంలో తమ రాజకీయ ప్రయోగాలు చేయడం ఆనవాయితీగా మార్చుకొన్నారు. వైఎస్ రాజశేఖర్ రెడ్డి ఆ అలవాటును పరాకాష్ఠకు తీసుకవెళ్లాడు.

తాను అధికారంలో వున్నన్ని రోజులూ కరెంట్ చార్జీలు పెంచనని భీషణ ప్రతిజ్ఞ చేశాడు వైఎస్. అదే సమయంలో పెరిగే విద్యుత్ అవసరాలకు అనుగుణంగా ఉత్పత్తి పెంచడానికి కృషి చేసి వుంటే ఆయన ప్రతిజ్ఞ కొంతలో కొంత అయినా నెరవేర్చడం వీలయ్యేది. కానీ ఆ దిశలో ప్రయత్నం జరపక పోవడమే కాదు, వున్న ప్రాజెక్టులు నడపడానికి బొగ్గు, గ్యాస్ వంటి ఇంధనాల సరఫరాకు కూడా జాగ్రత్తలు తీసుకోలేదు. దానితో ఏటికేడాది విద్యుత్ అవసరాలు పెరుగుతూ పోతుంటే, ఉత్పత్తి మాత్రం తగ్గుతూ వచ్చింది. దాని ఫలితం కోతలు. ఇప్పటికే రాష్ట్రంలో పరిశ్రమలకు మూడు రోజుల కోత అమలులో వుంది. పల్లెలలో దాదాపు పగలంతా కరెంట్ వుండడం లేదు. నగరాలు కూడా తీవ్రమైన కోతలు ఎదుర్కొంటున్నాయి. ఈ ఏడాది వానలు కురవకపోవడంతో నాగార్జునసాగర్, శ్రీశైలం రిజర్వాయర్లు ఎండిపోయి వున్నాయి. వాటి నుంచి వచ్చే జల విద్యుత్ లేనట్లే లెక్క. దానితో రానున్న వేసవిలో కరెంట్‌కొరత మరింత భయంకరంగా వుండబోతున్నది.

జమీన్‌రైతు

రైతులకు, వివిధ పారిశ్రామిక రంగాలకు ఇస్తున్న రాయితీల వల్ల విద్యుత్ పంపిణీ సంస్థలకు రాబడి తగ్గిపోయింది. అవి దాదాపు 25వేల కోట్ల రూపాయల నష్టంతో కునారిల్లుతున్నాయని చెప్తున్నారు. మన రాష్ట్రంలో చాలినంత విద్యుత్ లేనప్పుడు ఇతర రాష్ట్రాల నుంచి కొనుగోలు చేయడం సాంప్రదాయం. కానీ విద్యుత్ సంస్థల వద్ద నిధులు లేనందువల్ల ఎవరూ కరెంట్ అమ్మడానికి ముందుకు రావడం లేదు. ఉత్పత్తి చేయడానికి విద్యుత్ కేంద్రాలు లేక, కొనడానికి చేతిలో పైసలు లేక మొత్తం విద్యుత్ రంగమే అస్తవ్యస్తంగా మారిపోయింది.

దీన్ని చక్కదిద్దడానికి విద్యుత్ ఛార్జీల పెంపకం ఒక్కటే మార్గమని భావిస్తున్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. గత నాలుగేళ్లుగా విద్యుత్ సంస్థలు తమ కొనుగోలు ధర కంటే తక్కువకు విద్యుత్ సరఫరా చేశాయి కాబట్టి, ఆ లోటును ప్రజల నుంచి ఇప్పుడు వసూలు చేయడానికి ఫ్యూయల్ సర్‌చార్జి అడ్జస్ట్‌మెంట్ పేరిట దాదాపు 10వేల కోట్ల రూపాయలు వసూలు చేయడం మొదలు పెట్టాయి విద్యుత్ సంస్థలు. 2014 వరకు ఈ వసూలు కొనసాగుతుందని అంచనా. ఎప్పుడో వాడిన కరెంట్‌కు ఇప్పుడు బిల్లు కట్టవలసి రావడం ప్రజలను ఇబ్బంది పెడుతున్నది. బాడుగ ఇళ్లలో బ్రతికే వారి పరిస్థితి మరింత దుర్లభం. ఎవరో వాడుకొన్నదానికి వీరు చెల్లింపులు చేయవలసి వస్తున్నది. చేయకుంటే ఫ్యూజ్ పీకేస్తున్నారు. ఇది చాలక కొత్తగా యూనిట్‌కు ఒక రూపాయి వరకు చార్జీ పెంచడానికి ప్రతిపాదనలు సిద్ధం చేశారు. ఆ ప్రతిపాదన అమలులోకి వస్తే ప్రతి వినియోగదారుడికీ నెల వారీ బిల్లు రెట్టింపు కంటే ఎక్కువగా వస్తుంది. దాన్ని భరించే ఆర్థిక స్థోమత సామాన్యులకు వుండదన్నది నిజం. మంత్రి వర్గంలోనే తీవ్ర వ్యతిరేకత ఎదురు కావడం వల్ల ప్రస్తుతానికి ఆ ప్రతిపాదన పక్కన పెట్టారు.

విద్యుత్ కొరత తీరడానికి ఉత్పత్తి ఎంత అవసరమో, విద్యుత్ చార్జీలు ప్రజలు భరించే స్థాయిలో వుంచడానికి ఉత్పత్తి ఖర్చు తగ్గించుకోవడం అంతే అవసరం. గ్యాస్ ద్వారా కరెంట్ ఉత్పత్తి చేయడం ఒక్కటే అందుకు మార్గం. మన రాష్ట్రంలో అపారమైన గ్యాస్ నిల్వలున్నాయి. కానీ రాజకీయ పరమైన ఒత్తిడి లేక పోవడం వల్ల ఆ గ్యాస్ మన రాష్ట్రానికి ఉపయోగపడడం లేదు. కేంద్రం మీద ఒత్తిడి తెచ్చి చాలినంత గ్యాస్ కేటాయించుకొనే రాజకీయ నాయకత్వం మనకు లేకుండా పోయింది. దానితో ఇప్పటికే కోతలతో సగం చచ్చి వున్న ప్రజలను ధరల పెంపకమనే వాతలతో పూర్తిగా చంపేయాలని చూస్తున్నది ప్రభుత్వం. ఆ పోకడ కొనసాగితే రాష్ట్ర ప్రగతి తిరోగమనంలోకి జారుకోవడం ఖాయం.

## జనవాణి

### బహిరంగ ఉరినే సమస్యకు పరిష్కారం!

ఢిల్లీ అత్యాచారబాధితురాలు అమానత్‌కు యావద్భారతం కన్నీటి నివాళి అర్పించింది. నిందితులను శిక్షించాలని యువలోకం స్పందించిన తీరు అందరినీ ఆలోచింపజేసింది. ఈ నీచానికి పాల్పడినవారికి ఉరి శిక్షనే సరైన శిక్ష అని ప్రజాభిప్రాయం వెల్లడవుతోంది. అతి త్వరగా ఈ శిక్ష అమలయ్యేటట్లు కోర్టు తీర్పులువెలువడాలి. కామాంధులు భయపడే విధంగా అత్యాచారాలకు పాల్పడే వారు ఆ శిక్షలను చూసి గడగడ వణికేటట్లు వుండాలి. దేశంలోని ఏ రాష్ట్రంలో ఎక్కువ అత్యాచారాలు జరుగుతున్నాయో ఆ రాష్ట్రంలో బహిరంగ ఉరికి సుప్రీం కోర్టు ప్రత్యేక ఆదేశాలివ్వాలి. ఢిల్లీ యువతిపై అత్యాచారం చేసిన దుర్మార్గులు ఆరుగురిని ఒక్కో రాష్ట్రంలో ఎంచుకొన్న ప్రదేశాల్లో బహిరంగ ఉరితీస్తే కాని దేశంలో ఈ అత్యాచార కాండ ఆగదు. బహిరంగ ఉరి అమలు పర్చడం కోసం అవసరమైతే రాజ్యాంగ సవరణకు సైతం చట్ట సభలు పూనుకోవాలి.

సోలా జానకీదేవి — నెల్లూరు

### చట్టం అమలేది?

బహిరంగ ప్రదేశాలలో పొగ తాగడాన్ని చట్టపరంగా నిషేధించారు. కాని అమలు చేయడం లేదు. నెల్లూరు ఆత్మకూరు బస్టాండు, ఆర్టీసి బస్టాండ్, రైల్వే స్టేషన్, ట్రంకురోడ్లపై విచ్చలవిడిగా పొగ తాగుతున్నారు. బహిరంగ ప్రదేశాల్లో ధూమపానం చేసే వారి వల్ల ప్రక్కనున్న వారు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ముఖ్యంగా స్త్రీలు, పిల్లలు, అనారోగ్య బాధితులు ఇబ్బంది పడాల్సి వస్తోంది. టీ బంకులు, బ్రాందీ షాపులు, బార్లు పొగరాయుళ్లతో వర్ధిల్లుతున్నాయి. పొగరాయుళ్ల భరతం పట్టను చిత్తశుద్ధి ప్రయత్నం అవసరం.

సిహెచ్.రామారావు — నెల్లూరు

### పురందరేశ్వరి సాధించారు!

తెలుగువారి ఆత్మగౌరవాన్ని ఢిల్లీ వీధుల్లో రెపరెపలాడించిన తెలుగు తేజం, తెలుగువారి ఆత్మ గౌరవానికి ప్రతీక స్వర్గీయ ఎన్టీ రామారావు విగ్రహాన్ని పార్లమెంట్ ఆవరణలో నెలకొల్పేందుకు అనుమతి సాధించిన కేంద్ర మంత్రి దగ్గుబాటి పురందరేశ్వరి అభినందనీయులు. తొమ్మిదేళ్లపాటు ముఖ్యమంత్రిగా 2004 నుండి ప్రతిపక్ష నాయకుడిగా కొనసాగుతూ కేంద్రంలో ఎన్డీఏ ప్రభుత్వానికి మద్దతునిచ్చి స్పీకర్ పదవి పొంది, యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వ ఏర్పాటులో కీలకపాత్ర నిర్వహించి కేంద్రంలో మంత్రి పదవులు తన వారికి ఇప్పించుకొన్న నారా చంద్రబాబు నాయుడు పార్టీ వ్యవస్థాపకులు తమకు రాజకీయ భిక్ష పెట్టిన ఎన్టీఆర్ విగ్రహ ఏర్పాటుకు ఎటువంటి చొరవ చూపకపోగా విగ్రహాన్ని నెలకొల్పేందుకు అనుమతి సాధించిన పురందరేశ్వరిపై అసత్య ప్రచారం చేయడం సముచితం కాదు.

ఎన్.బాబురావు — నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**15-1-1943**
**పేజీలు : 8 వెల: 0-1-6**

### నెల్లూరు ముచ్చట్లు

### వెంకటగిరి ఎస్టేటు

దివాను లేడు. పాలనలో నలుపు రంగు మారలేదు. అయితే రాజబంధువుల, నగరి పిల్లకాయల పవర్ మాత్రం కొంత తగ్గింది. నీటి వసతుల రిపేరు విషయంలో ఆవగింజంత మార్పులేదు. ప్రభుత్వ మేమో ఎస్టిమేట్లు చేయిస్తున్నది. ప్రభుత్వం రిపేరు చేయించడానికి కూడా ఎస్టేటు హృదయం ఒప్పుకోదు. ఇందుకే కాబోలు గవర్నరును వెంకటగిరికి ఆహ్వానిస్తారనే రూమరుంది. లోకమోహనమైన వసంత కాలంలో కూడా చిగర్చని వెదురు వృక్షాల మాదిరున్నవి ఈ ఎస్టిమేట్లు. కట్టెవంక పొయ్యి తీర్చుతోందన్నట్లు భగవంతుడే ఈ కుక్కతోక కుంటిదీర్చాలె స్వామీ!

### విందులు

మొన్నటి దువ్వూరురెడ్డి, పెనుబోలు గుప్తగార్ల వివాహపు విందులు బహు రుచికరంగా బహు ఆనందంగా ఉండినవి. కానీ ఆ ఎక్కి తొక్కి వదలి పెట్టిన రాసులు – కొండలు ఈ యాహార సంక్షోభ కాలంలో చేయతగినవి కావు. ఇకనైనా ఈ లాంటి విందులు మానేస్తే మంచిది.

### బ్యాంకి ప్రెసిడెంటు

జిల్లా కో ఆపరేటివ్ బ్యాంకి ప్రెసిడెంట్ ఎలెక్షన్ 17వ తేది జరుగుతుంది. దశయ్య అధ్యక్షుడుగా, పర్వతరెడ్డి ప్రతాపసింహారెడ్డి(ఎం.ఎస్.నరసింహారావు గారు) ఉపాధ్యక్షుడుగా ఉంటాడనీ, పోటీలు ఉండవనీ, దైవజ్ఞుల మాట. అనారోగ్యము, బొత్తిగా తీరికలేని కారణాలతో వీర్ని ప్రెసిడెంటుగా మేము ఒప్పుకోము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**11-1-1963**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### మహబూబ్‌ఖాన్ పేరుతో ఒక సంస్థ!

స్వర్గీయ సౌదాగర్ మహబూబ్‌ఖాన్ గారి చిత్రపటం గత 28వ తేది మునిసిపల్ ఆఫీసులో ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి గారిచే ఆవిష్కరింపబడింది. ఇన్‌ఛార్జ్ ఛైర్మన్ లక్ష్మణ గుప్త స్వాగతం చెప్పారు. ఈ సమావేశంలో మహబూబ్‌ఖాన్ గారి కుమారుడు పార్లమెంటు సభ్యుడు ఉస్మాన్ అలీఖాన్ గూడా పాల్గొన్నారు.

ఈ సందర్భంలో మహబూబ్‌ఖాన్ గారితో తన చిరకాల పరిచయాన్ని సింహావలోకనం జేస్తూ వారి మరణం వ్యక్తిగతంగా తనకు తీరని లోటన్నారు. ముఖ్యమంత్రి సంజీవరెడ్డి మహబూబ్‌ఖాన్ జ్ఞాపకార్థం వారి కుటుంబీకుల సహకారంతో నెల్లూరు పౌరులకు ఏదైనా ప్రజోపయోగమైన సంస్థను నెలకొల్పాలని సూచించారు.

3వ తేది సాయంకాలం టౌన్‌హాలులో ఏ.సి.సుబ్బారెడ్డి గారి అధ్యక్షతన, స్వర్గీయ మహబూబ్‌ఖాన్ గారి సానుభూతి సభ జరిగింది. శ్రీయుతులు తిక్కవరపు రామిరెడ్డి, పైడా సుబ్బరామయ్య, రేబాల లక్ష్మీనరసారెడ్డి, జి.సి.కొండయ్య, రేబాల దశరథరామిరెడ్డి, ముంగమూరు వెంకట సుబ్బారావు, పసుపులేటి సిద్ధయ్య నాయుడు, అబ్దుల్ ఫరూక్ సాహెబ్ గారలు మహబూబ్‌ఖాన్ గారి జీవిత విజయాన్ని నిరాడంబరత్వాన్ని గూర్చి ప్రశంసిస్తూ మాట్లాడారు. వారి పేరు శాశ్వతంగా ఉండుటకు ఒక పెద్ద సంస్థను నెలకొల్పవలసిందిగా రామిరెడ్డి గారు వారి కుటుంబీకులను కోరారు.

–మా.వి

# నెల్లూరు ముచ్చట్లు
## విశ్లేషణ

## స్వర్ణభారత్‌లో సంక్రాంతి సంబరం!

ఎక్కడ పండుగ చేసినా చేయక పోయినా బిజెపి నేత వెంకయ్యానాయుడు గారి స్వర్ణభారత్ ట్రస్ట్‌లో ప్రతి పండుగ చేయడం రివాజుగా మారింది. వెంకటాచలంలోని ట్రస్ట్‌లో 11వ తేది సంక్రాంతి సంబరం జరగబోతోంది. ఈ సందర్భంగా జరిగే సభకు వెంకయ్యానాయుడు అధ్యక్షత వహిస్తారు. జార్ఖండ్ తాజా మాజీ ముఖ్యమంత్రి అర్జున్ ముండా ముఖ్య అతిథిగా విచ్చేస్తారు. విశిష్ట అతిథులుగా ఆర్‌ఎస్‌ఎస్ అధికార ప్రతినిధి రాంమాధవ్, ప్రముఖ పాత్రికేయుడు సుధీంద్ర కులకర్ణి, గౌరవ అతిథులుగా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ బివి రమణకుమార్ హాజరవుతారు. ప్రముఖ గాయకుడు మనో బృందంతో సంగీత విభావరి ఉంటుంది. ముగ్గుల పోటీ, వ్యాస రచన పోటీల్లో విజేతలకు బహుమతి ప్రధాన కార్యక్రమం ఉంటుందని మేనేజింగ్ ట్రస్టీ దీపావెంకట్ చెబుతూ నెల్లూరీయులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు.

## పండుగ జోరు తగ్గిందా?

నెల్లూరులో సంక్రాంతి పండుగ జోరు ఇంకా కనిపించలేదు. బట్టల షాపులు, కిరాణా దుకాణాలు 9వ తేది నాటికి కూడా కిటకిటలాడుతూ కానరావడం లేదు. కొన్ని ప్రాంతాల్లోని పిండి మిల్లుల వద్ద మాత్రం కాస్త సందడి కానవస్తుంది. సాగునీరు ఆలస్యంగా వదలడం వల్ల నారువేతలు పూర్తి కావడం మినహా సంక్రాంతికి కోతలు మొదలయ్యే పరిస్థితి జిల్లాలో ఎక్కడా లేదని చెప్పాలి. పంట చేతికొస్తే కదా రైతుల లోగిళ్లలో పండుగ 'కళ' కన్పించేది.

## సర్‌ఛార్జీ మళ్లీ బాగా దట్టించారు!

జనవరి మొదటి వారంలో ఎపిఎస్‌పిడిసిఎల్ జారీచేసిన బిల్లులలోనూ విద్యుత్ ఛార్జీ కంటే ఎఫ్‌ఎస్‌ఏ రెట్టింపుగా రావడంతో జనం గుండెలు బాదుకొంటున్నారు. డిశంబర్ నెలలో కాల్చిన విద్యుత్ ఛార్జీకి తోడుగా 2012 జూన్‌లో కాల్చిన విద్యుత్‌ను బట్టి యూనిట్‌కు రూపాయి 32 పైసల ఎఫ్‌ఎస్‌ఏ వేశారు. దీంతో ఈ నెలలో వంద యూనిట్లు పైబడి విద్యుత్‌ను కాల్చిన వినియోగదారులందరికీ వెయ్యి రూపాయలుగా విద్యుత్ బిల్లులొచ్చాయి. నెల నెలా పెరిగిపోతున్న విద్యుత్ బిల్లులు సామాన్య, మధ్య తరగతీయులు కట్టడం కష్టంగా పరిణమించింది.

## నెల్లూరీయుల్లో నీరసం?

జమీందారి వ్యతిరేక పోరాటం, సారా వ్యతిరేక పోరాటం, పొదుపు ఉద్యమాలకు పురుడు పోసిన చరిత్ర నెల్లూరు సీమది. కానీ ఈ మధ్య నెల్లూరీయుల్లో ఎందువల్లో నిరాసక్తత ప్రబలింది. విద్యుత్ శాఖ ఇష్టమొచ్చినట్లు ఎఫ్‌ఎస్‌ఏ ఛార్జీలు పెంచినా, మళ్లీ విద్యుత్ ఛార్జీలు పెంచుతామని ప్రకటన జారీచేసినా ఉద్యమాల జిల్లాలో చెప్పుకోదగ్గ నిరసన కార్యక్రమం ఇప్పటికీ జరగలేదు. వైకాపా, తెదేపాలోని కోటంరెడ్డి సోదరులు చిన్నా చితకా ప్రదర్శనలు చేయడం మినహా ఉద్యమ పార్టీలుగా చెప్పుకొనే సిపిఎం, సిపిఐలు జనాన్ని ఈ వ్యవహారంపై చైతన్యపరుస్తూ వారిని వీధిబాట పట్టించలేకపోయారు. తెలుగుదేశం పార్టీ ఆఫీసులో కుర్చీలు సర్దుకోను రవికి సమయం సరిపోతున్నట్లుంది. బిజెపి సరికొత్త నీరస నాయకుడు వచ్చాడు. ఇక జనాన్ని విద్యుత్ వ్యతిరేక ఉద్యమంలో పాలుపంచుకొనేలా ఎవరు బాధ్యత స్వీకరిస్తారు.

## కరెంట్ ఛార్జీలు పెంచేయలేదు!

విద్యుత్ ఛార్జీల పెంపుపై ప్రభుత్వం తుది నిర్ణయమేదీ తీసుకోలేదని రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రజలను దువ్వే ప్రయత్నం చేశారు. ఈ విషయమై ఆయన మాట్లాడుతూ విద్యుత్ పంపిణీ సంస్థలు ఛార్జీల పెంపుదల కోసం విద్యుత్ నియంత్రణ మండలికి ప్రతిపాదనలు మాత్రమే చేశాయని, దీనిపై ప్రభుత్వం తుది నిర్ణయం తీసుకోవాల్సి ఉందని చెప్పుకొచ్చారు.

## బిజెపి జిల్లా అధ్యక్షునిగా సురేంద్రరెడ్డి!

భారతీయ జనతా పార్టీ జిల్లా అధ్యక్షునిగా పి.సురేంద్రరెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అధ్యక్ష పదవికి కర్నాటి ఆంజనేయరెడ్డి, మిడతల రమేష్ పోటీపడ్డా ఎన్నికల పరిశీలకులు నారాయణస్వామి, భానుప్రకాష్‌రెడ్డి పోటీదారుల మధ్య సమన్వయం కుదిర్చి సురేంద్రరెడ్డికి ఈ బాధ్యతలు అప్పగించారు. గతంలోనూ సురేంద్ర పార్టీ జిల్లా అధ్యక్షునిగా పని చేశారు. తెర వెనుక మంత్రాంగం మినహా పార్టీ క్యాడర్‌లో పట్టులేని నాయకుడు.

## మేకపాటికి చెక్?

వైకాపా జిల్లా వ్యవహారాలన్నింటినీ ఇటీవల వరకు నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి పర్యవేక్షించేవారు. ఇప్పుడు ఈయనకు తోడుగా జగన్మోహన్‌రెడ్డి స్వంత మనిషి ఒంగోలుకు చెందిన మాజీ మంత్రి బాలినేని శ్రీనివాసులురెడ్డిని ప్రాంతీయ కో ఆర్డినేటర్‌గా నియమించారు. రాజమోహన్‌రెడ్డితో శ్రీని

కొరవ 14వ పేజీలో

### తృతీయ వర్ధంతి



వరిగొండ పద్మావతమ్మ
మరణం : 12-01-2010

మీరు మాపై చూపిన ప్రేమాభిమానాలను ఎన్నటికి మరువలేము. తృతీయ వర్ధంతి సందర్భంగా మిమ్మల్ని స్మరించుకొంటూ...

అశృనయనాలతో...

: కుమారుడు :
వి. వేణుగోపాలరావు
మరియు కుటుంబ సభ్యులు

### మరువలేము నాన్న...



షేక్ మహబూబ్ సాహెబ్
(మహబూబ్ క్లాత్ మర్చంట్స్)
అల్లూరు.

తొమ్మిదవ వర్ధంతి (బర్సీ)
13.1.2013 సందర్భంగా
శ్రద్ధాంజలి ఘటిస్తూ...

కుమారుడు ... అల్లూరు రహీం
సబ్ ఎడిటర్
జమీన్‌రైతు, నెల్లూరు.
కోడలు ... గౌసున్నీసా బేగం
మనుమడు ... ఆషిక్

# భర్త కాదు... కాలయముడు

**కిరాయి హంతకులతో భార్యను చంపించిన కలియుగ భర్త**



హత్య జరిగిన తీరును వివరిస్తున్న ఎస్పీ రమణకుమార్.

ప్రేమించి పెళ్లి చేసుకోవడమే గాక ఒక బిడ్డకు ఆమెతో కలసి జన్మనిచ్చాడు. కానీ మళ్లీ పాత స్నేహితురాలి పరిష్వంగనలో సేద తీరాలనుకున్నాడు. అడ్డుగా ఉన్న భార్యను హతమార్చాలని మాంత్రికులను కలిశాడు. పని కాకపోవడంతో కిరాయి హంతకులను రంగంలోకి దింపి ఆమెను చంపించడమే కాకుండా ఏ భర్త చేయించకూడని విధంగా ఆమెను అత్యాచారం చేయించిన విషయం తెలుసుకొని జనం నోరెళ్ల బెట్టవలసి వచ్చింది. నార్తు రాజుపాళెంకు చెందిన ఇస్మాయిల్ తనతో కలసి చదువుకొన్న అమరజ్యోతిని ప్రేమించి పెళ్లి చేసుకొన్నాడు. మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తూ మూలపేటలోని చమండితోటలో మిద్దె కూడా కట్టాడు. వీరి ప్రేమకు గుర్తుగా ఏడేళ్ల ధరణి పుట్టాడు. హాయిగా సాగుతున్న వీరి కాపురంలోకి పాత స్నేహితురాలు రావడంతో దంపతుల మధ్య పొరపొచ్చాలు పెరిగాయి. దీంతో ఇస్మాయిల్ భార్య అమరజ్యోతిని వదిలించుకోవాలనుకున్నాడు. కుక్కలగుంటలో ఓ మాంత్రికుని కలసి అమరజ్యోతికి చేతబడి చేయమన్నాడు. పని కాకపోవడంతో విడవలూరుకు చెందిన స్నేహితుడు చిరంజీవితో కలసి చిత్తూరుకు చెందిన కిరాయి హంతకులు పాలపాటి పవన్‌కుమార్‌రెడ్డి, ఎద్దుల బాబురెడ్డి, దాముల నవీన్‌కుమార్‌తో కలసి హత్యకు పథకం రచించాడు. డిశంబర్ 27వ తేది అమరజ్యోతి బంధువులు నెల్లూరుకు షాపింగ్‌కు రాగా ఆమెను వాళ్ల వద్ద దించి వచ్చాడు. తిరిగి ఇంటికి వచ్చి కిరాయి హంతకులను ఇంట్లో దిగబెట్టి తలుపులు వేశాడు. భార్యను ప్రేమతో షాపింగ్ నుంచి ఇంటికి తీసుకువచ్చి వదలి డ్యూటీకి వెళ్తున్నానంటూ వెళ్లి పోవడం ఇంట్లోని అగంతకులు అమరజ్యోతిని అంతమొందించడంతోపాటు ఆమెను చంపే ముందు పాశవికంగా అత్యాచారం చేశారు. ఈ ఘటన దోపిడీ దొంగలు చేసిందని నమ్మించేలా ఇస్మాయిల్ కథ, స్క్రీన్‌ప్లే అల్లాడు. కొత్తగా నగరానికి వచ్చిన డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డి కరకుగా విచారణ జరిపి వారం రోజుల్లో హంతకులను అరెస్ట్ చేయగలిగారు. ఆయనకు సిఐ మద్ది శ్రీనివాసరావు కూడా బాగా సహకరించారు. భార్య అమరజ్యోతిని అంతమొందించిన ఇస్మాయిల్‌కు ఐపిసి చట్టాల ప్రకారం శిక్ష ఏ మేరకు పడుతుందో ఏమో గానీ పరలోకంలో మాత్రం ఆయన చేసిన రెండు ఘోరాలకు పాతక శిక్షలు మాత్రం అనుభవించక తప్పదు. ఇస్మాయిల్ అమరజ్యోతిని అంతమొందించిన తీరు నగర మహిళల్లో విస్తృత చర్చ జరగడంతోపాటు వారి వెన్నులు వణికించింది.

# దొంగలతో కలసి వెళ్తే... దొంగతనం బయట పడుతుందా?

**• ఇసుక రీచ్ తోడేసిన వ్యవహారంపై దర్యాప్తు తీరిది**

జలయజ్ఞం ముసుగులో జిల్లాలోని నదీ గర్భాలలో తోడేసిన ఇసుక వ్యవహారమై నిర్ధారణకు శ్రీకాళహస్తి తెలుగు గంగ ఇంజనీరింగ్ అధికారుల బృందం విచ్చేసింది. పోతిరెడ్డిపాళెం ఇసుక రీచ్‌లో భారీగా త్రవ్వకాలు చేసిన విషయం గమనించింది. జలయజ్ఞం అభివృద్ధి పనులంటూ ఇసుకను తరలించకపోయి బ్లాక్ మార్కెట్‌లో కోట్లాది రూపాయలు ఆర్జించిన విషయం విచారణ కమిటీ గమనించింది. పోతిరెడ్డిపాళెం రీచ్‌లో ఎటుచూసినా 200 మీటర్ల పొడవు వెడల్పులతో మూడు నుండి నాలుగు మీటర్ల లోతైన అగాధాలు ఏర్పడిన విషయం కూడా విచారణ కమిటీ కళ్లకు బాగా కనిపించింది. విచారణ గణం మరబోట్లు తెప్పించి మరీ నీటిలో కొలతలు గట్రావేశారు. ఇదంతా బాగుంది కానీ ఈ విచారణ బృందంతో పాటు ఇసుకను అక్రమంగా తరలించేందుకు సూత్రధారులైన సోమశిల, ఇరిగేషన్ పర్యవేక్షక ఇంజనీర్లు సోమశేఖర్, కోటేశ్వరరావు పాల్గొనడం పలు అనుమానాలకు తావిస్తుంది. ఈ విచారణలో అసలు దొంగలపై చర్యలు తీసుకోకుంటే హైకోర్టును ఆశ్రయిస్తామని రైతు సంఘం ప్రకటించడం గమనార్హం.



రీచ్‌లలో త్రవ్వకం ఆగేదెన్నటికి?

# ఒవైసీ దిష్టిబొమ్మ దగ్ధం!

**• నెల్లూరులో ఆర్‌ఎస్‌ఎస్ నిరసన**




గాంధీబొమ్మ వద్ద నిరసన ప్రదర్శన చేస్తున్న దృశ్యం.

ఎంఐఎం ఎమ్మెల్యే అక్బరుద్దీన్ ఒవైసీ నిజామాబాద్‌లో హిందువుల అంతు చూస్తామని, హిందూ దేవతలు, పండుగలను అవహేళన చేస్తూ మాట్లాడినందుకు నిరసనగా 4వ తేది విశ్వహిందూ పరిషత్ జిల్లాశాఖ, బిజెపి ఆధ్వర్యంలో గాంధీబొమ్మ సెంటర్‌లో కార్యకర్తలు రాస్తారోకో చేసి ఒవైసీ దిష్టిబొమ్మను దగ్ధం చేశారు. ఈ సందర్భంగా విహెచ్‌పి రాష్ట్ర సమన్వయ కార్యదర్శి మెంటా రామ్మోహన్‌రావు మాట్లాడుతూ ఒవైసీ వ్యాఖ్యలు హిందువుల మనసులు గాయపరచాయన్నారు. హిందూ దేవతలను అవమానపరిస్తే సహించేది లేదని, హిందూ ధర్మాన్ని కాపాడుకొనేందుకు వెనుకాడేది లేదని స్పష్టం చేశారు. సహనం లోపిస్తే ఒవైసీ స్వేచ్ఛగా తిరుగలేని పరిస్థితులు వస్తాయని హెచ్చరించారు. ఒవైసీని అరెస్ట్ చేస్తే సరిపోదని, ఎంఐఎంను నిషేధించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆయన డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమం బిజెపి జిల్లా కార్యదర్శి మిడతల రమేష్, విహెచ్‌పి నేతలు బయ్యా శ్రీనివాసగుప్తా, శరత్‌కుమార్ శర్మ, ఆర్‌ఎస్‌ఎస్ నాయకులు సుధాకర్, పవన్ పాల్గొన్నారు.

# రైతులపై పోలీసు కేసులా?

**• వాస్తవ పరిస్థితులు పరిశీలించండి కలెక్టర్ గారు!**



సాగునీటి సరఫరా విషయంలో రైతులపై కేసులు నమోదు చేయకూడదని గత నెల 22న జరిగిన జిల్లా సమీక్షా మండలి(డిఆర్సీ) సమావేశంలో మంత్రులు ఆనం రామనారాయణ రెడ్డి, పితాని సత్యనారాయణలు అధికారులను ఆదేశించారు. మంత్రులు ఆదేశించి 20 రోజులు గడవక ముందే జిల్లా కలెక్టర్ మరో ప్రకటన చేసి రైతాంగంలో ఆందోళన కలిగించారు. జనవరి నెలలో వరినాట్లు వేయరాదని ఇంతకు ముందే కలెక్టర్ ప్రకటించిన సంగతి తెలిసిందే. మన జిల్లాలోని తీర ప్రాంత మండలాల్లో నారుమళ్లు ఆలస్యంగా పోసుకున్న చిన్న, సన్నకారు రైతులు జనవరి నెలలో నాట్లు వేసుకోవడం ఆనవాయితీ. వర్షాలు సకాలంలో కురవక పోవడం కూడా ఇందుకు కారణంగా చెప్పవచ్చు. డిఆర్సీ సమావేశంలో జిల్లా ఎమ్మెల్యేలు ముక్త కంఠంతో రైతులపై కేసులు బనాయిస్తే ఊరుకునేది లేదని మంత్రుల దృష్టికి తీసుకెళ్లారు. అదే వేదికపై ఉన్న జిల్లా కలెక్టర్ సమక్షంలోనే నీటి పారుదల శాఖాధికారులను కాల్వల నుంచి సాగునీటిని మోటార్ల ద్వారా వినియోగిస్తే కేసులు పెట్టరాదని మంత్రులు చెప్పారు. జనవరిలో కూడా వరి నాట్లు వేయడం ఏమిటని? వీరికి సాగునీరు ఎక్కడ నుంచి వస్తుందంటూ కలెక్టర్ అధికారులను ప్రశ్నించిన తీరుపై రైతులు అసహనం వ్యక్తం చేస్తున్నారు. దేశానికి అన్నం పెట్టే రైతులపై కేసులు బనాయించాలని కలెక్టర్ కింది స్థాయి అధికారులను ఆదేశించడం చర్చనీయాంశంగా మారింది. జిల్లాలో అల్లూరు, విడవలూరు, చిల్లకూరు తదితర మండలాల్లో ప్రస్తుతం వరినాట్లు వేస్తున్నారు. వ్యవసాయశాఖ, నీటిపారుదల శాఖ అధికారులు జిల్లాలో వ్యవసాయ సాగు పరిస్థితుల గురించి కలెక్టర్‌కు వివరిస్తే మంచిది.

# నకిలీ పత్రాలతో నడుస్తున్న టూరిస్ట్ బస్సులు!

**తనిఖీలలో కాని బయటపడని వ్యవహారం**

ప్రైవేటు రవాణాలో నకిలీ ధృవ పత్రాలతో తిరిగే వాహనాలు అధికం అవుతున్నాయి. ప్రభుత్వం, అధికారుల కళ్లుగప్పి టూరిస్టు బస్సులు వివిధ ప్రాంతాలకు వెళ్తుండడంతో ప్రభుత్వానికి నష్టం చేకూరుతున్నది. హైదరాబాద్, విజయవాడ తదితర ప్రాంతాల నుంచి మన రాష్ట్రంతోపాటు వివిధ రాష్ట్రాలకు టూరిస్టు బస్సులు నడుస్తుంటాయి. ప్రయాణించే సమయంలో సంబంధిత రవాణా శాఖ అధికారుల నుంచి రూట్ పర్మిట్లు పొందడంతోపాటు ట్యాక్స్ చెల్లింపు జరపాలి. అలాగే ఆర్సీ, ఫుట్‌పాస్ సర్టిఫికెట్లు, ఇతరత్రా పత్రాలు ఉండాలి. అయితే కొందరు ఇందులో అక్రమాలకు పాల్పడుతున్నారు. నకిలీ రూట్ పర్మిట్లు, ఫుట్‌పాస్ సర్టిఫికెట్లు సైతం నకిలీవే సృష్టించి బస్సులను నడుపుతూ అక్రమాలకు పాల్పడుతున్నారు. అయ్యప్పల సీజన్ కావడంతో టూరిస్టు బస్సులకు ఎక్కడలేని డిమాండ్ ఉంటుంది. వివిధ ప్రాంతాల నుంచి శబరిమలై తదితర ప్రాంతాలకు బస్సులను నడుపుతూ లక్షలు ఆర్జిస్తుంటారు. వాహనాలు తనిఖీ చేసినప్పుడు సంబంధిత సిబ్బందిని మచ్చిక చేసుకొని చాలా మటుకు దొరకకుండా అన్నీ సక్రమంగా ఉన్నట్లు తిరుగుతుంటారు. అయితే ఇటీవల నెల్లూరు నగరంలో రవాణా శాఖ అధికారులు చేసిన తనిఖీల్లో దొంగ పర్మిట్లు, నకిలీ సర్టిఫికెట్లతో తిరుగుతున్న ఇలాంటి టూరిస్టు బస్సుల వ్యవహారం బట్టబయలైంది. ఆర్టీఏ అధికారులు మినీ బైపాస్‌లో వాహనాలను తనిఖీ చేస్తున్న సమయంలో ప్రక్క జిల్లాల నుంచి నకిలీ పర్మిట్లతో శబరిమలై వెళ్తున్న బస్సును పట్టుకొన్నారు. తనిఖీల సమయంలో ఇలాంటివి దొరకుతుండగా దర్జాగా ఎలాంటి ఇబ్బందులు లేకుండా తిరిగే బస్సులు అనేకం ఉన్నట్లు తెలుస్తున్నాయి. తరచూ అధికారులు తనిఖీలు నిర్వహిస్తుంటే ఇలాంటి అక్రమాలకు పాల్పడేవారు చిక్కుతారు.

# నరుకూరులో వైకాపా సంతకాల సేకరణ

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జగన్ విడుదల కోరుతూ చేపట్టిన కోటి సంతకాల సేకరణ కార్యక్రమం నరుకూరులో జోరుగా సాగింది. విజయ డైరీ మాజీ ఛైర్మన్, వైకాపా నేత చిల్లకూరు సుధీర్‌రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొని దగ్గరుండి సంతకాల సేకరణ జరిపారు. కుట్రతో జగన్‌ను అరెస్టు చేసి జైలు పాలు చేశారన్నారు. దీనిపై ప్రజల అభిప్రాయాన్ని సంతకాల రూపంలో తెలియజేసేందుకు ఈ కార్యక్రమాన్ని చేపట్టామన్నారు. కోటి సంతకాలతోనైనా కాంగ్రెస్ ప్రభుత్వానికి కనువిప్పు కల్గుతుందేమో చూడాలన్నారు. ప్రతిష్టాత్మకంగా నిర్వహించిన ఈ కార్యక్రమంలో మండల కన్వీనర్ టంగుటూరి పద్మనాభరెడ్డి పాల్గొనక పోవడం చర్చకు తెరలేపింది. ఇతర నేతలు కావలిరెడ్డి శ్యాంసుందర్‌రెడ్డి, తూపిలి శ్రీధర్‌రెడ్డి, జితేంద్రరెడ్డి, శ్రీనివాసులు, వేగూరు శ్రీనివాసులు, రామాచార్యులు తదితరులు పాల్గొన్నారు.

**చిల్లకూరు సుధీర్‌రెడ్డి నేతృత్వం**

# విధి నిర్వహణలో అలసత్వం పనికిరాదు!

## కావలిలో వివిధ శాఖాధికారుల సమీక్షలో కలెక్టర్.

విధి నిర్వహణలో అలసత్వం వహిస్తే సహించేది లేదని జిల్లా కలెక్టర్ శ్రీధర్ అధికారులను హెచ్చరించారు. ప్రజల బాగోగులు పట్టించుకోని అధికారులు అవసరం లేదన్నారు. కావలి పట్టణంలో వివిధ శాఖల అధికారులతో ప్రభుత్వ పథకాల అమలు, రైతులకు రుణాలు అందజేయడం తదితర అంశాలపై సమీక్షించారు. ప్రజలు వివిధ సమస్యలతో అధికారుల వద్దకు వస్తుంటారని, అలాంటి వారి సమస్యలు తెలుసుకొని పరిష్కరించడంలో బాధ్యతాయుతంగా వ్యవహరించాలన్నారు. గ్రామాల్లో పంచాయితీ కార్యదర్శులు, గ్రామ రెవెన్యూ అధికారులు ప్రజలకు అందుబాటులో వుండడంలేదని, అలాంటి వారిపై చర్యలు తప్పవన్నారు. అధికంగా ఫిర్యాదులు వచ్చిన ఇస్కపాళెం పంచాయితీ కార్యదర్శిని సస్పెండ్ చేయాలని సంబంధిత అధికారులను ఆదేశించారు. కౌలు రైతులకు రుణాలు అందజేయడంపై మాట్లాడుతూ బ్యాంకు అధికారులు ఈ విషయమై తగిన శ్రద్ధ వహించాలన్నారు. గతంలో రుణం తీసుకొని చెల్లించని రైతులను ప్రక్కనపెట్టి మిగతా కౌలు రైతులకు రుణాలు అందజేయాలన్నారు. ఎంపిడిఓలు బ్యాంకు అధికారులతో తరచూ సమావేశమవుతూ అన్ని శాఖలకు సంబంధించిన యూనిట్లు గ్రౌండ్ చేయించుకోవాలని కోరారు. ఈ సమావేశానికి విచ్చేసిన కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు అధికారుల తీరుపై కలెక్టర్‌కు ఫిర్యాదు చేశారు. పేదలకు సహాయం చేయమని ప్రతి సమావేశంలో అడగడం, ఆ తర్వాత అధికారులు పట్టించుకోకపోవడం మామూలైపోయిందని అసంతృప్తి వ్యక్తం చేశారు. గృహ నిర్మాణాలకు సంబంధించి అధికారుల చుట్టూ పేదలు చెప్పులరిగేలా తిరుగుతున్నా పట్టించుకోవడం లేదని, దీంతో చాలామటుకు సగంలోనే నిలిచిపోయాయన్నారు. కౌలు రైతుల విషయంలోనూ బ్యాంకర్లు ముందుకు రాకపోవడం విచారకరమన్నారు. దీనికి కలెక్టర్ స్పందిస్తూ వీటిపై తగిన చర్యలు చేపడుతామన్నారు. ఈ సమావేశంలో ఎంపిడిఓ, ఎమ్మార్వో, వ్యవసాయ శాఖ, ఇందిరక్రాంతి పథం, గృహనిర్మాణ సంస్థల అధికారులు పాల్గొన్నారు.

# ఎన్‌డిఆర్ ట్రస్ట్ సేవలు!



సమావేశంలో మాట్లాడుతున్న కేశవులురెడ్డి.

తోటపల్లి గూడూరు మండలం మాచర్లవారిపాళెం గ్రామంలో జూనియర్ కళాశాల ఏర్పాటుకు ఎన్‌డిఆర్ ట్రస్టు ముందుకొచ్చింది. విద్యార్థుల సౌకర్యార్థం భవన నిర్మాణాన్ని జరుపుతామని నాయుడు దశరథరామిరెడ్డి తనయుడు ఎన్‌డిఆర్ ట్రస్టు ఛైర్మన్ నాయుడు ఆదికేశవులురెడ్డి ప్రకటించాడు. పారిశ్రామికవేత్తగా లబ్ధిప్రతిష్టులైన ఎన్‌డిఆర్ పేరున ట్రస్టు స్థాపించి పలు సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న విషయం తెలిసిందే. జిల్లా పరిషత్ హైస్కూల్ నిర్మాణానికి తోడ్పడ్డారు. ఇటీవల ఎన్‌డిఆర్ 14వ వర్ధంతిని పురస్కరించుకొని హైస్కూల్‌లో ఉత్తమ ప్రతిభ కనపరచిన విద్యార్థిని విద్యార్థులకు దుప్పట్లు, పుస్తకాలను పంచి పెట్టారు. ఈ సందర్భగా ఆదికేశవులురెడ్డి మాట్లాడుతూ ప్రస్తుతం వున్న భవనంలో విద్యార్థులకు తగిన సౌకర్యాలు లేక అవస్థలు పడుతున్నందున నూతన భవనాన్ని నిర్మించేందుకు తగిన చర్యలు చేపడుతామన్నారు. ఈ కార్యక్రమంలో కళాశాల ప్రిన్సిపాల్ హుస్నారా, ప్రధానోపాధ్యాయుడు కృపాకర్‌రెడ్డి, అల్లూరు రాఘవేంద్రశర్మ, రమణయ్యనాయుడు తదితరులు పాల్గొన్నారు.

# సేవా కార్యక్రమాల్లో బిల్డర్ బిఎన్‌రాజు!



హాస్టల్‌లో విద్యార్థులకు కలర్ టీవీని అందజేస్తున్న బిల్డర్ రాజు.

ప్రముఖ బిల్డర్ బిఎన్ రాజు తన చేతనైనంతలో సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ పలువురి మన్ననలు అందుకొంటున్నాడు. ఇందులో భాగంగానే చిట్టమూరు గిరిజన బాలుర జూనియర్ కళాశాల విద్యార్థులకు కలర్‌టివి, డివిడి ప్లేయర్‌ను అందించడంతోపాటు స్వీట్లు పంచి పెట్టారు. కొత్త సంవత్సరాన్ని పురస్కరించుకొని జరిగిన ఈ కార్యక్రమంలో ముఖ్యఅతిధిగా పాల్గొన్న ఐటిడిఏ పిఓ వై.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ విద్యార్థుల చదువుల కోసం ప్రభుత్వం ఎంతగానో తోడ్పడుతుందన్నారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ఉన్నత స్థితికి చేరుకోవాలన్నారు. కళాశాల విద్యార్థులకు వివిధ పరికరాలను అందజేసిన ఇంజనీర్ బిఎన్ రాజు మాట్లాడుతూ మంచి నడవడిక, క్రమశిక్షణతో సమాజానికి ఉపయోగపడేలా ఎదగాలని, విలువలతో కూడిన విద్యను నేర్చుకోవాలని అభిలషించారు. కష్టపడి కాకుండా ఇష్టపడి చదవడం వలన మంచి ఫలితాలు సాధించవచ్చన్నారు. ఈ కార్యక్రమంలో ప్రిన్సిపాల్ వెంకటయ్య ఇతర సిబ్బంది పాల్గొన్నారు.

# రౌడీ కంప్యూటర్ ఆపరేటర్!

## ఇబ్బంది పడుతున్న అధికారులు, జనం.

గ్రామ రెవెన్యూ అధికారిపై కంప్యూటర్ ఆపరేటర్ దాడి వ్యవహారం వెంకటాచలం మండలంలో కలకలం రేపింది. స్థానిక తహశీల్దార్ కార్యాలయంలో కంప్యూటర్ ఆపరేటర్‌గా పని చేస్తున్న సురేష్ అనికేపల్లి గ్రామ రెవెన్యూ అధికారిపై దాడి చేసిన సంగతి తెలిసింది. ఈ వ్యవహారం తారాస్థాయికి చేరుకొంది. బాధితుడిని వెంటబెట్టుకొని విఆర్‌ఓల సంఘం జిల్లా అధ్యక్షుడు అశోక్‌రెడ్డి తహశీల్దార్ జనార్ధన్‌రావుని కలసి కంప్యూటర్ ఆపరేటర్‌పై చర్యలు చేపట్టాలని కోరారు. ఈ నేపథ్యంలో రెవెన్యూ కార్యాలయానికి వచ్చిన సురేష్ తనను ఎవరూ ఏమి చేయలేరని బహిరంగంగా వ్యాఖ్యానించడం మరింత గొడవకు దారి తీసింది. ఈ కంప్యూటర్ ఆపరేటర్‌పై గతంలోను పలు ఆరోపణలు వచ్చాయి. వివిధ పనులపై వచ్చే వారిని విసుక్కోవడం, గొడవపడుతూ ఉండేవాడు. పాసుపుస్తకాల కోసం వచ్చే రైతులతోను తగాదాలకు దిగుతుండడంతో పలువురు ఈ కంప్యూటర్ ఆపరేటర్ వ్యవహారశైలిపై అధికారులకు ఫిర్యాదులు చేశారు. ఇటీవల అనికేపల్లికి చెందిన రైతుల పాసుపుస్తకాలు ఆలస్యం అవుతుండడంపై విఆర్ఓ రమణరావు ఆపరేటర్‌ను ప్రశ్నించడంతో ఆగ్రహించిన అతను విఆర్ఓపై పిడిగుద్దులతో దాడి చేశాడు. ఈ ఘటనతో కార్యాలయానికి వచ్చేవారు హడలిపోతున్నారు. దుందుడుకుగా వ్యవహరించే కంప్యూటర్ ఆపరేటర్‌పై చర్యలు చేపట్టాలని పలువురు కోరుతున్నారు.

# సాగునీటికై రైతుల రాస్తారోకో!



సాగునీటి కోసం రోడ్డెక్కిన జలదంకి రైతులు.

ప్రజాప్రతినిధులు, నేతలు పట్టించుకోకపోవడం, అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంతో విసిగివేసారిన రైతులు ఆందోళనకు దిగిన ఘటన జలదంకిలో చోటు చేసుకొంది. వేలాది రూపాయలు అప్పుచేసి నార్లు పోసుకొంటే సాగునీరు అందని కారణంగా తీవ్రంగా నష్టపోతున్న రైతులు చివరకు రోడ్డెక్కారు. స్థానిక రైస్‌మిల్లు సెంటర్ వద్ద రాస్తారోకో చేపట్టారు. ఈ సందర్భంగా వారు అధికారుల తీరుపై విరుచుకుపడ్డారు. సాగునీటి కోసం పలుమార్లు అధికారులకు విన్నవించినా ఫలితం లేకుండా పోతోందని వాపోయారు. దీనిపై ప్రశ్నిస్తే ఎవరు సాగు చేయమన్నారని ఎదురు ప్రశ్నిస్తూ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని మండిపడ్డారు. అధికసంఖ్యలో రైతులు పాల్గొన్న ఈ రాస్తారోకో రెండుగంటలకుపైగా సాగడంతో ట్రాఫిక్ తీవ్రంగా స్తంభించిపోయింది. పోలీసులు రాస్తారోకోను విరమించమని కోరినా, సంబంధిత అధికారులు వచ్చి హామీ ఇచ్చేవరకు ఇక్కడి నుంచి కదిలేది లేదని రైతులు భీష్మించడంతో పరిస్థితి ఉద్రిక్తంగా మారింది. చివరకు సోమశిల డిఇ రాఘవరావు తన సిబ్బందితో అక్కడకు వచ్చి రైతులను శాంతింపజేసేందుకు ప్రయత్నించినా ఫలితం లేకుండా పోయింది. సాగునీటి విషయమై స్పష్టమైన హామీ ఇవ్వాలని రైతులు డిమాండ్ చేశారు. దీనికి డిఇ స్పందిస్తూ నీటి విడుదల తన చేతిలో లేదని, పరిస్థితిని ఉన్నతాధికారులకు తెలియజేస్తానని, సమస్య పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇవ్వడంతో రైతులు రాస్తారోకో విరమించారు. పార్టీలకు అతీతంగా రైతులందరూ రాస్తారోకోలో పాల్గొనడంతో ట్రాఫిక్ స్తంభించిపోయింది.

**రోడ్డెక్కిన జలదంకి రైతులు**

● భూ పంపిణీకి

# మేకపాటి సోదరుల అడ్డు!

**కంభం విజయరామిరెడ్డి విమర్శ**



భూ పంపిణీకి మేకపాటి సోదరులే అడ్డుగా వున్నారని ఉదయగిరి మాజీ ఎమ్మెల్యే, కాంగ్రెస్ నేత కంభం విజయరామిరెడ్డి ఆరోపించారు. ముసునూరులో ఆ పార్టీ నేత డి.వి.కృష్ణారెడ్డి నివాసంలో విలేకరుల సమావేశం నిర్వహించి మేకపాటి సోదరులపై తీవ్ర విమర్శలు చేశారు. భూపంపిణీ జరగకుండా చేసేందుకు శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి అసైన్‌మెంట్ కమిటి సమావేశంలో పాల్గొనకుండా గొడవ సృష్టించారని, తన అనుచరుల చేత గొడవ చేయించారని విమర్శించారు. పేదలకు న్యాయం చేయాలని, భూపంపిణీ చేయాలన్న ఉద్దేశం వుంటే ఎమ్మెల్యే ఇలాంటి చర్యలకు పాల్పడరని, కాని వారికి ఏ కోశానా పేదలకు మంచి చేయాలని లేదన్నారు. రాజకీయ ఎత్తుగడలతో తన అనుచరులకు భూమి అప్పగించాలని ప్రయత్నం చేస్తున్నాడని ఆరోపించారు. ఈ సమావేశంలో మాజీ జడ్పీచైర్మన్ చెంచలబాబు యాదవ్, మాజీ ఎంపిపి కృష్ణారెడ్డి, రామిరెడ్డి, ఓబుల్‌రెడ్డి, రమణయ్య, కొండారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

● హిందూ అనేది

# మతం కాదు ఓ ధర్మం!

**కావలి ఆర్ఎస్ఎస్ శిబిరంలో బయ్యా**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు హిందూ వ్యతిరేక విధానాలను అవలంభిస్తున్నాయని ఆర్ఎస్ఎస్ జిల్లా ప్రముఖ్ బయ్యా శ్రీనివాసులు విమర్శించారు. రాజకీయ పార్టీలు తమ స్వార్థం కోసం ఓటు కోసం హిందూ ధర్మాన్ని తాకట్టు పెడుతున్నాయన్నారు. కావలి పట్టణంలో ఆర్ఎస్ఆర్ జూనియర్ కళాశాలలో ఇటీవల హిందూ చైతన్య శిబిరం జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ భారతదేశంలో పుట్టిన ప్రతిఒక్కరూ హిందువులేనన్నారు. హిందూ అనేది ఒక మతం కాదని అది ఒక ధర్మమన్నారు. వ్యక్తి నిర్మాణంతోనే శక్తి నిర్మాణం జరుగుతుందన్నారు. ప్రతి భారతీయుడు ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలన్నారు. ఈ శిబిరంలో ఆర్ఎస్ఎస్ కావలి పట్టణ ప్రముఖ్ వాయుగుండ్ల సుధాకర్, గంగాధర్‌రెడ్డితోపాటు స్వయంసేవకులు అధిక సంఖ్యలో హాజరయ్యారు.

# సహకార పోరుకు సిద్ధం కావాలి!

**టిడిపి కార్యకర్తలకు బీద పిలుపు**

త్వరలో జరుగనున్న సహకార సంఘ ఎన్నికలకు తెలుగుదేశంపార్టీ నాయకులు, కార్యకర్తలు సంసిద్ధులు కావాలని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు పిలుపునిచ్చారు. అల్లూరులో టిడిపి నేత అల్లంపాటి విజయవర్ధన్‌రెడ్డి నివాసంలో ఇటీవల ఎన్నికల్లో అనుసరించాల్సిన వ్యూహాలపై సమావేశం నిర్వహించారు. సొసైటీల వారిగా బలాబలాలను పరిశీలించి, కార్యకర్తలతో చర్చించారు. ఏడేళ్ళ తర్వాత నిర్వహిస్తున్న సహకార ఎన్నికలను సమర్ధవంతంగా నిర్వహించాల్సి వుండగా అధికారపార్టీ కుట్రలకు పాల్పడుతోందన్నారు. సొసైటీలో ఓటర్ల జాబితా బయటపెట్టకుండా ఇబ్బందులకు గురి చేస్తోందని విమర్శించారు. వీటన్నింటిని దృష్టిలో వుంచుకొని తెలుగుదేశంపార్టీ శ్రేణులు పకడ్బందీగా ఎన్నికల్లో పాల్గొనాలని, అధికార కాంగ్రెస్‌పార్టీ ఎత్తుగడలను తిప్పికొట్టాలన్నారు. సమర్ధవంతమైన వ్యక్తులను ఎన్నికల బరిలో దించాలని సూచించారు.

# ఎన్నికలు జరిపే సత్తా ప్రభుత్వానికి లేదు!

☛ బోగోలులో బీద రవిచంద్ర



స్థానిక సంస్థలకు ఎన్నికలు జరిపే సత్తా కాంగ్రెస్ ప్రభుత్వానికి లేదని తెలుగుదేశంపార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర విమర్శించారు. ఓటమి భయంతో ఎన్నికలను వాయిదా వేస్తున్నారని, దీనిని బట్టే ప్రభుత్వ తీరు అర్ధమవుతున్నాదని దుయ్యబట్టారు. టిడిపి జిల్లా అధ్యక్ష పదవి చేపట్టిన తర్వాత తొలిసారిగా బోగోలు మండలంలో పర్యటించారు. ఆయనకు తెలుగుదేశం పార్టీ శ్రేణులు ఘనస్వాగతం పలికారు. అనంతరం స్థానికంగా జరిగిన కార్యకర్తల సమావేశంలో పాల్గొన్న రవిచంద్ర మాట్లాడుతూ సహకార ఎన్నికలు జరిపేందుకు అనుమతిచ్చిన ప్రభుత్వం మోసపూరితంగా అధికారాన్ని చేజిక్కించుకొనేందుకు అడ్డదారులు తొక్కుతున్నాదని ఆరోపించారు. దీనిలో భాగంగానే కాంగ్రెస్ నేతల ఇళ్లలో రికార్డులు వుంచడం, ఓటర్ల జాబితా బైటపెట్టకపోవడం వంటి అక్రమాలకు పాల్పడుతున్నాదన్నారు. వీటిపై రైతులు పోరాటం చేయాలని, అధికారపార్టీ చేసే ఆగడాలను అడ్డుకోవాలని పిలుపునిచ్చారు. రాబోయే ఎన్నికల్లో ప్రజలు తెలుగు దేశంపార్టీ పట్టం కట్టడం ఖాయమన్నారు. సోమశిలలో 30 టిఎంసిల నీరువున్నా నీరు అందించలేకపోతున్నారని, గతంలో 13 టిఎంసిలు వున్నా పైరు ఎండకుండా చేసిన ఘనత తెలుగుదేశం ప్రభుత్వానిదేన్నారు. ఈ సందర్భంగా కార్యకర్తలు రవిచంద్రను కలిసి శుభాకాంక్షలు తెలిపారు. ఆయన ప్రతి కార్యకర్తను పేరుపేరున పలకరించడంతో సంతోషపడ్డారు. ఈ కార్యక్రమంలో బిసి సంఘం కార్యదర్శి పంది పెనుగొండయ్య, తెలుగు రైతు జిల్లా కార్యదర్శి నాగేశ్వరరావు, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

● తూతూ మంత్రంగా

# ఉపాధి హామీ విచారణలు!

**జిల్లా అంతటా ఇదే పరిస్థితి**

ఉపాధిహామీ పనుల్లో అవకతవకలపై జరుగుతున్న విచారణలు సామాజిక తనిఖీలు తూతూ మంత్రంగా సాగుతుండడంతో అక్రమాలు వెలుగు చూడడం లేదని, సిబ్బంది చాలామటుకు తప్పించుకొంటున్నారన్న విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ఇటీవల కొండాపురం మండలంలో ఉపాధిహామీ పనుల తనిఖీలపై ఇలాంటి వ్యాఖ్యాలే వినవచ్చాయి. మండల పరిధిలోని సాయిపేటలో జరిగిన పనుల్లో రెండులక్షల రూపాయలకు పైగా అవినీతి జరిగినట్లు ఆరోపణలు వచ్చాయి. క్షేత్రస్థాయి సిబ్బంది దీనిని నిర్ధారించారు. అయితే అధికారులు మాత్రం కేవలం నాలుగువేల రూపాయలు రికవరీ చేసి చేతులు దులుపుకొన్నారు. కొందరు అధికారులు విచారణ సక్రమంగా జరపకుండా తూతూ మంత్రంగా చేసి అయిందనిపిస్తుండడంతో సామాజిక తనిఖీలపై ఆరోపణలు వస్తున్నాయి. క్షేత్రస్థాయి సిబ్బంది జరిపిన తనిఖీల్లో అక్రమాలు వెలుగు చూస్తుండగా అధికారుల చర్యలు మాత్రం స్వల్పంగా వుంటుండడంతో అక్రమాలకు పాల్పడిన వారు సులభంగా తప్పించుకుంటున్నారు. దీనిపై ఉన్నతాధికారులు దృష్టి నిలిపి ఉపాధిహామీ పనుల్లో జరుగుతున్న అవకతవకలపై కఠినంగా వ్యవహరించాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

# కౌలు రైతులకు రుణాల్లో ఇందుకూరుపేట ఫస్ట్!

కౌలు రైతులకు రుణాలు అందజేయడంలో జిల్లాలోనే ఇందుకూరుపేట మండలం మొదటి స్థానంలో నిలిచింది. దాదాపు కోటి రూపాయలు రైతులకు రుణాల రూపంలో అందజేశారు. ఈ సందర్భంగా తహశీల్దార్ కార్యాలయంలో ఒక కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా తహశీల్దార్ శ్రీనునాయక్ మాట్లాడుతూ కోటి రూపాయలు రుణాలు అందజేయడంలో బ్యాంకర్లు ప్రణాళికాబద్ధంగా వ్యవహరించగా, మండల పరిధిలోని అన్ని గ్రామాల విఆర్ఓలు, రెవెన్యూ సిబ్బంది విశేషకృషి చేశారని అభినందించారు. కౌలు రైతులకు రుణాలు సక్రమంగా అందడం లేదని విమర్శలు వ్యక్తం అవుతున్నా ఇందుకూరుపేట మండలంలో మాత్రం బ్యాంకర్లు, రెవెన్యూ అధికారులు రుణాలు అందేలా చేయడంలో సక్ర మంగా వ్యవహరించారు. అధికారులు చేసిన కృషిని రైతులు అభినందించారు. ఈ కార్యక్రమంలో డిప్యూటి తహశీల్దార్, విఆర్ఓలు, ఆర్ఐలు, బ్యాంకు అధికారులు పాల్గొన్నారు.

# సమావేశం పెట్టమన్నాడు... రాలేదు!

## వాయిదాపడ్డ ఉదయగిరి అసైన్‌మెంట్ కమిటీ సమావేశం

కావలి ఆర్డీవో కార్యాలయంలో ఇటీవల జరిగిన అసైన్‌మెంట్ కమిటీ సమావేశం పోలీస్ భద్రత నడుమ జరిగింది. గత సమావేశంలో కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీల మధ్య గొడవ జరగడంతో ఈసారి అలాంటి వాటికి ఆస్కారం లేకుండా కట్టుదిట్టమైన భద్రత కల్పించారు. అసైన్‌మెంట్ కమిటీ ఛైర్మన్ అయిన ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి మాత్రం సమావేశానికి గైర్హాజరు కావడం చర్చనీయాంశమయ్యింది. గతంలో జరిగిన అసైన్‌మెంట్ కమిటీ సమావేశాన్ని తనకు చెప్పకుండా నిర్వహిస్తున్నారని విమర్శించిన ఎమ్మెల్యే ఈసారి ఆయన అనుమతితోనే సమావేశాన్ని ఏర్పాటు చేసినా కావాలనే గైర్హాజరయ్యారని కమిటీసభ్యులు విమర్శించారు. నియోజకవర్గంలో 3500 ఎకరాల అసైన్డ్‌భూమిని పేదలకు పంచేందుకు సిద్ధం చేసినా అది ఇష్టం లేకనే ఎమ్మెల్యే అడ్డుకొంటున్నాడని, కుయుక్తులు పన్నుతున్నాడని ఆరోపించారు. ఎన్ని అడ్డంకులు సృష్టించినా జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి ఆధ్వర్యంలో సమావేశం నిర్వహించి పేదలకు భూమిని పంపిణీ చేస్తామన్నారు. కమిటి కన్వీనర్ అయిన ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి హాజరైన సభ్యుల నుంచి అభిప్రాయాలు సేకరించారు. అనివార్య కారణాల వల్ల సమావేశం వాయిదా వేస్తున్నామని ఆయన ప్రకటించారు.




కరెంట్ చార్జీల పెంపుదలపై జనాన్ని చైతన్య పరుస్తూ నెల్లూరులో ప్రదర్శన చేస్తున్న వైకాపా నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

# రావమ్మా మహాలక్ష్మి విఫలం!

## వైద్య ఆరోగ్య సిబ్బందే కారణం

మాతా శిశు మరణాలు తగ్గించేందుకు రాష్ట్రంలో ఎక్కడా లేని విధంగా రావమ్మా మహాలక్ష్మి కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు అధికారులు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలపై ప్రజలకు భరోసా ఇవ్వడం ఈ కార్యక్రమ ఉద్దేశం. జిల్లావ్యాప్తంగా ఈ ఈ కార్యక్రమాన్ని ఆర్భాటంగా ప్రారంభించినప్పటికీ వైద్య సిబ్బందిలో మార్పు రాకపోతుండడంతో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు వచ్చేవాళ్లు వైద్య సేవలు అందక ఇబ్బందులు పడుతున్నారు. సీతారామపురం మండలంలో జరిగిన ఘటన ఇందుకొక ఉదాహరణ. మండలంలోని చిన్నగంగిపల్లెకు చెందిన మౌలాబీకి పురిటి నొప్పులు రావడంతో మధ్యాహ్నం అక్కడ గల ఆస్పత్రికి తీసుకొని వచ్చారు. ఆ సమయంలో ఆస్పత్రి నర్సు లేకపోవడంతో వాచ్‌మెన్ ఆమెను తీసుకొని వచ్చేందుకు వెళ్లాడు. ఆమె ఎంతకు రాకపోవడం, పురిటి నొప్పులు అధికం కావడంతో విషయం తెలుసుకొన్న స్థానికులు సమాచారాన్ని డిఎంహెచ్‌ఓకు ఇతర ఉన్నతాధికారులకు తెలిపారు. తీరిగ్గా రాత్రి ఎనిమిది గంటలకు రావడంతో బంధువులు, కుటుంబసభ్యులు నర్సుపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. దీనికి నర్సు నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడం మరింత కోపం తెప్పించింది. ఇది తన డ్యూటీ కాదని ఉన్నతాధికారులకు చెప్పినా ఏమి చేస్తారని ప్రశ్నించిందట. ఏమాత్రం ఆలస్యం జరిగి వున్నా తల్లీబిడ్డ ప్రాణాలు కోల్పోవలసి వచ్చేదని, ఇలాంటి వాటిని అరికట్టాలని ఆమె తరువువారు జిల్లా వైద్యఆరోగ్యశాఖధికారిని అడిగితే నర్సుపై చర్యలు తీసుకొంటామని చెప్పి చేతులు దులుపుకొన్నారు. ఇంతటి నిర్లక్ష్యం ప్రదర్శించే వైద్య సిబ్బంది వున్నప్పుడు ప్రభుత్వం ఎన్ని కార్యక్రమాలు నిర్వహించినా ఫలితం వుండదు.

# నెల్లిమిట్ట కండ్రిగలో సబ్‌స్టేషన్!

## లోఓల్టేజ్ సమస్యకు పరిష్కారం

తోటపల్లి గూడూరు మండలం కోడూరు పంచాయితీలోగల నెల్లిమిట్ట కండ్రిగలో కోటిరూపాయల వ్యయంతో 33 కెవి సబ్‌స్టేషన్‌ను నిర్మించారు. ఈ సబ్‌స్టేషన్ ఏర్పాటుతో ఈ ప్రాంత ప్రజలు దీర్ఘకాలంగా ఎదుర్కొంటుండిన లోఓల్టేజ్ సమస్య తీరనుంది. ఇందుకోసం ప్రారంభంలో స్థల సేకరణ విషయంలో ఇబ్బందులు ఎదురైనప్పటికీ వాటిని అధికమించి గృహ అవసరాలకు, రైతులకు విద్యుత్ సరఫరాలో ఆటంకాలు ఎదురుకాకుండా వుండేందుకు జాఫర్ సాహెబ్ కెనాల్ డిస్ట్రిబ్యూటరీ ఛైర్మన్ దువ్వూరు సురేంద్రనాథ్ రెడ్డి గట్టి కృషి చేశారు. ఇటీవల ఈ సబ్‌స్టేషన్‌ను డిఇ అనిల్ కుమార్ లాంచనంగా ప్రారంభించారు. ఎడి విజయకుమార్ రెడ్డి, ఎఇ మధుసూధన రెడ్డి, నరసింహారావు తదితరులు పాల్గొన్నారు. ఈ సబ్‌స్టేషన్ ఏర్పాటుతో విద్యుత్ సరఫరాలో సమస్యలు తొలగడంతోపాటు ఐదు మందికి ఉద్యోగావకాశాలు లభించాయి.

# కసుమూరులో ప్రారంభానికి నోచుకోని వక్ఫ్ కార్యాలయం!

ప్రసిద్ధ యాత్రా స్థలం కసుమూరు దర్గా వద్ద లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన వక్ఫ్ బోర్డు కార్యాలయం ప్రారంభానికి నోచుకోలేదు. ఆరు నెలల క్రిందట లక్షల రూపాయలు వ్యయపరచి ఈ కార్యాలయాన్ని నిర్మించారు. భవనం నిర్మాణం పూర్తయినా ఇంతవరకు ప్రారంభం కాలేదు. రాజకీయ నేతలు తమ స్వార్థం కోసం

### అడ్డుపడుతున్న రాజకీయ శక్తులు

వక్ఫ్‌బోర్డు భవనాన్ని ప్రారంభించకుండా అడ్డుకొంటున్నారనే విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ఇప్పటికైనా జిల్లా అధికారులు జోక్యం చేసుకొని నిర్మాణం పూర్తి చేసుకొని ఆరు నెలలుగా ప్రారంభానికి నోచుకోకుండా వున్న దీనికి మోక్షం కల్పించాలని కోరుతున్నారు.

# అతిగా మాట్లాడిన అక్బరుద్దీన్!

## రెండు మతాల మధ్య విద్వేషాలను రేకెత్తించే ఉపన్యాస కళతో ప్రయోజనమేమి?



"అయోధ్యలో రాముడు పుట్టాడని బాబ్రీ మసీదును కూల్చిపారేశారు. కానీ హర్యానాలో కౌసల్యాపురం అనే ఊరొకటి వుంది. అక్కడి వాళ్లు కౌసల్య రాముడికి అక్కడే జన్మ ఇచ్చిందని చెప్తుంటారు. ఈ కౌసల్య ఎక్కడెక్కడ తిరిగి, ఎందరు రాముళ్లకు జన్మ ఇచ్చింది?"

"400 ఏళ్లనాడు హిందూస్థాన్‌కు వచ్చిన బాబర్ గురించే సరైన చారిత్రక ఆధారాలు లేవు. ఎప్పుడో కొన్ని లక్షల సంవత్సరాల క్రితం నాటి రామాయణం, రాముడు నిజమని పిచ్చివాళ్లు నమ్ముతున్నారు".

"హిందువులకు ఎందరు లక్ష్మీదేవతలున్నారు. నాకు తెలిసి లక్ష్మీదేవి అని ఒకామే వుంది. కానీ ఈ భాగ్యలక్ష్మి ఎక్కడనుంచి పుట్టుకొచ్చింది?"

"పాకిస్తాన్ నుంచి వచ్చిన కసబ్ అనే పిల్లవాడు ఏదో కొద్దిమందిని చంపాడని హిందూస్థాన్ ఎంత గగ్గోలు పెడుతున్నది. పాపమా పసి బాలుడిని ఉరి తీసింది. కానీ వేల మందిని చంపిన నరేంద్రమోడిని ఇదే హిందూస్థాన్ ఎందుకు ఉరి తీయదు?

"ఒక్క పదిహేను నిముషాలు పోలీసులను పక్కన పెట్టండి. ఈ దేశంలోని పాతిక కోట్ల మంది ముస్లింలు నూరు కోట్ల హిందువులను ఏమి చేస్తారో చూపిస్తాను".

ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ పట్టణంలో మజ్లిస్ శాసనసభ్యుడు అక్బరుద్దీన్ ఒవైసీ చేసిన విద్వేష పూరిత ప్రసంగం నిండా హిందు దేవతల గురించి, మతం గురించి ఇటువంటి విష పూరిత వ్యాఖ్యలే వున్నాయి. దాదాపు గంట సేపు సాగిన ప్రసంగంలో ఆయన హిందు మతంపై కుండల కొద్దీ విషం క్రుమ్మరించాడు. అక్బరుద్దీన్‌లో ఎంతటి శక్తివంతమైన ఉపన్యాస కళ దాగి వుందో దాన్ని చూస్తే అర్థమై పోతున్నది.

### లక్షలాది యువతలో స్పందన

యూ ట్యూబ్ అనే ఇంటర్‌నెట్ సైట్‌లో ప్రసంగం తాలూకు వీడియో చిత్రం వుంది. ప్రపంచం మొత్తం మీద కొన్ని లక్షల మంది ఆ చిత్రాన్ని చూస్తున్నారు. వివిధ ఇంటర్నెట్ వెబ్‌సైట్లలో, ఈమెయిళ్లలో దినపత్రికలకు పంపే సందేశాలలో లక్షలాది మంది హిందు, ముస్లిం యువత దీనిపై తమ అభిప్రాయాలను ప్రకటిస్తున్నది. హైదరాబాద్ పాత నగరం నుంచి వెలువడే సియాసత్ ఉర్దూ పత్రిక వెబ్‌సైట్‌లో వేలాది సంక్షిప్త సందేశాలు కనపడుతున్నాయి. దాన్నిబట్టి అక్బరుద్దీన్ ప్రసంగం, తదనంతర పరిణామాలు దేశంలో ఎంతటి తీవ్రమైన మతపర ప్రభావాన్ని చూపుతున్నదీ అర్థం చేసుకోవచ్చు.

### ఇందుకా శిక్షణ?

అమితాబ్ బచ్చన్ కూడా అక్బరుద్దీన్ నటనా వైదుష్యం ముందు దిగదుడుపు అవతాడేమో అన్పిస్తున్నది – ఆ ప్రసంగం తాలూకు లఘు చిత్రం చూస్తే. ఆవేశం, క్రోధం, ఉద్రేకం, విషాదం, వైరాగ్యం, వెటకారం, జాలి, సానుభూతి వంటి హావభావాలను అద్భుతంగా ప్రదర్శించాడు అక్బరుద్దీన్ ఒవైసీ. ఆయన కంఠస్వరంలో పలికిన నవరసాల తీరు చూస్తే ఆయన రాజకీయవాది అనే నమ్మకం కల్గడం లేదు. రాటుదేలిన రంగస్థల నటుడనే భావన కల్గుతున్నది ఎవరికైనా.

లండన్ నగరంలో ఉన్నత విద్య చదివేటప్పుడు ఉపన్యాస కళలో ప్రత్యేక శిక్షణ పొందాడట అక్బరుద్దీన్. ఆ ప్రావీణ్యాన్ని దేశంలో మత సామరస్యాన్ని విధ్వంసం చేసి, రెండు మతాల మధ్య విద్వేషాన్ని రగిలించడానికి వినియోగించ చూడడం అత్యంత దురదృష్టకరం.

### యాధృచ్ఛికం కాదు

ఏదో క్షణికావేశంలోనో, అప్పటికప్పుడు పుట్టిన ఉద్రేకంతోనో అక్బర్ ఈ ప్రసంగాలు చేయలేదనడం నిజం. ఆ మాటల తీరులో ఆవేశం కంటే లోతైన ఆలోచన కన్పడుతున్నది. ఒక పథకం ప్రకారమే, ఒక ప్రణాళిక ప్రకారమే ఈ దుశ్చర్యకు పూనుకొన్నాడనేది స్పష్టం. ఆ పథకం లక్ష్యం ఏమిటనేది ప్రశ్న. శాసనసభలో తమ సీట్ల సంఖ్య పెంచుకోవడానికి ముస్లిం ఓటు బ్యాంకు తయారు చేయడం పైకి కన్పించే ఉద్దేశం. కానీ కారణం అదే అయితే, మహారాష్ట్రలోని నాందేడ్ నగరంలో ఇటువంటి ప్రసంగం చేయవలసిన అవసరం లేదు. అక్కడ మజ్లిస్

కొరవ 14వ పేజీలో



కృష్ణపట్నం పోర్టు జనరల్ మేనేజర్ వేణుగోపాల్‌కు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్న పోర్టు సిబ్బంది.



నూతన సంవత్సరం సందర్భంగా సూళ్లూరుపేటలోని చెంగాళమ్మకు పట్టువస్త్రాలు తీసుకెళ్తున్న ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, దేవస్థానం ఛైర్మన్ వై.హర్షవర్ధన్‌రెడ్డి.




పండుగ అంటే ఉత్సవము, ఆనందము అని అర్థం. ఆచార వ్యవహారాలు, సంస్కృతీ సాంప్రదాయాలను ప్రతిబింబించే పండుగలను ఘనంగా జరుపుకొంటుంటారు. ఈ పండగలన్నింటిలోకి సంక్రాంతిని పెద్ద పండుగగా విశిష్టమైన పండుగగా భావిస్తారు. సూర్యుడు నెలకో రాశి చొప్పున పన్నెండు రాశులలోను సంక్రమిస్తుంటాడు. అందుకే సంక్రమణం అని పేరొచ్చింది. సంక్రమణం అనగా ఒక చోట నుంచి మరొక చోటుకి మారడమని అర్థం. పన్నెండు సంక్రమణలు ఏడాదిలో వున్నా మకర సంక్రమణం విశిష్టమైనది. ఆనాటి నుండి సూర్యుడు ధనూరాశి నుండి మకర రాశిలోకి ప్రవేశించడం వలన దక్షిణాయనం పోయి ఉత్తరాయణం ఆరంభమవుతుంది. సూర్యుడు ఉత్తరాభిముఖుడై చేసే సంచారం కాబట్టి దీన్నే ఉత్తరాయణం అంటారు. ఇది దేవతలకు పగటి కాలం.

మకర సంక్రాంతి పండుగరోజుల్లో మొదటి పండుగ భోగి. అగ్నిమూల స్వరూపం సూర్యుడు కాబట్టి భోగినాడు ప్రాత:కాల సమయంలో భోగి మంటలు వేసి చలి కాసుకొంటారు. దీనిని సూర్యునికి ఆరాధనగానూ భావిస్తారు. పాత అంతటిని మంటలలో వేసే యజ్ఞకుండమే భోగి. సకల భోగాలను ఇచ్చే భోగి మంట తర్వాత స్నానం చేసి దేవుడిని పూజిస్తారు. సాయంత్రం పిల్లలకు భోగి పళ్లు పోస్తారు. రేగు పళ్లు, నాణాలు కలగలిపి చిన్నారుల తలపై పోయడాన్ని భోగిపళ్లు పోయడం అంటారు. భోగి తర్వాత రెండవ రోజున వచ్చే పండుగ సంక్రాంతి. పెద్ద పండుగగా పిలిచే ఈ పండుగను గ్రామాల్లో వేడుకగా జరుపుకొంటారు. ఇంటి ముందు రంగవల్లుల కళకళలు, హరిదాసు సంకీర్తనలు, గంగిరెద్దులు, పిండివంటల ఘుమఘుమలు, కొత్త బట్టలు ధరించి ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగ ఇది. తెలుగు సంస్కృతీ సాంప్రదాయాలు ఈ పండుగలో ప్రతిబింబిస్తాయి. పండుగనాడు కొన్ని ప్రాంతాల్లో గాలిపటాలు ఎగురవేస్తారు. పతంగుల పండుగగా పిలుస్తారు. వానలు తగ్గి ఎండ, చలి కలగలసిన ప్రకృతిలోని నూతన తేజోమయ వాతావరణం సంక్రాంతి పండుగరోజుల్లో ఏర్పడుతుంది. దీని తర్వాత కనుమ, ముక్కనుమలను జరుపుకొంటారు. కనుమనాడు పాడి పశువులకు పూజ చేస్తారు. అందంగా అలంకరిస్తారు. అందుకే దీనికి పశువుల పండుగ అనే పేరొచ్చింది.

ఇక ఉత్తరాయణమనేది పుణ్యకాలం. ఈ రోజుల్లో ఆచరించే దాన ధర్మాలు, చేసే పూజలు ఉత్తమోత్తమమైన ఫలితాలను ఇస్తాయని పలు గ్రంధాలు పేర్కొంటున్నాయి. ఈ కల్పం ప్రారంభంలో ప్రళయం వచ్చి ప్రపంచమంతా జలమయ

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

*తేది 12-1-2013 నుండి 18-1-2013 వరకు వృషభంలో గురువు, కేతువు 14తేది వరకు తదుపరి మేషంలో; తులలో శని; 14తేది వరకు వృశ్చికంలో రాహువు తదుపరి తులలో; ధనుస్సులో బుధ, శుక్రులు, రవి 14తేది వరకు తదుపరి మకరంలో; మకరంలో కుజుడు, 16తేది నుండి బుధుడు; ధనుర్మకర, కుంభ, మీనాలలో చంద్రుడు సంచరిస్తారు.*




తలపెట్టిన పనులలో కొన్ని ఆలస్యమగుట, ఆశించినది దూరమగుట, శరీరారోగ్య లోపాలు, రావలసిన బాకీలకై తక్షణ పరిష్కారాలు అవసరమవుతాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి పనులలో ఆటంకాలున్నా ఆర్థికాదాయం వుంటుంది. తరచూ వస్తున్న లోపాలను సరిదిద్దుకోవాలి. వ్యాపార ప్రయాణాలు, ఉద్యోగ సమస్యలు, అనుకున్న పనులు జరగక నిరాశకు గురౌతారు.




ఈ రాశివారికి కొన్ని విషయాలలో తగు జాగ్రత్తలు అవసరం. అలౌకిక వ్యవహారాలలో తలదూర్చకండి. నూతన రుణాలకై ప్రయత్నాలు చేయవద్దు. నూతన వాహన సౌకర్యం లభించును. కొన్ని సమస్యలకు వాయిదా వేయడం మంచిది. వృత్తి, వ్యాపార రంగాల వారు ఆర్థికంగా సామాన్య లాభాలు చూస్తారు. విద్యార్థుల నూతన విషయాలకై అన్వేషిస్తారు. విద్యా విషయంగా పంతాలకు పోవద్దు.




ఇంట్లో అనవసరపు ఖర్చులుంటాయి. కొందరు చేసిన నిర్ణయాలను వ్యతిరేకిస్తారు. వృత్తి, వ్యాపార రంగాల వారు నూతన కార్యాచరణకు వ్యూహాత్మకత వుంటుంది. విద్యార్థులు వాగ్ధోరణిని అదుపులో వుంచాలి. మనోనిబ్బరం చాలా అవసరం. వ్యవసాయదారులు క్రమశిక్షణాయుత పద్ధతిని పాటిస్తారు. వాగ్దాన భంగాలుండవు. కళా, క్రీడా రంగాలవారికి వృత్తిపరమైన చర్చలలో విజయప్రాప్తి.




శత్రువర్గాలతో విభేదాలు శాంతినివ్వవు. ఇతరులను తక్కువ అంచనా వేయవద్దు. మీరనుకున్న పనిని సాధిస్తారు. విద్యార్థులు మనోనిబ్బరంతో సంకల్ప బలాన్ని పెంచండి. వ్యవసాయదారులు రుణాన్వేషణలో వుంటారు. స్పెక్యులేషన్ లాభించదు. కళా, క్రీడా రంగాల వారు ఇతరుల సహాయ సహకారాలు మరువవద్దు. రాజకీయులకు నామమాత్రపు యోగింపు. ఆశాంభంగాలుంటాయి.




తలపెట్టిన పనులలో తరచూ ఆటంకాలు, అయితే కృషికి తగిన ఫలితముంటుంది. ఇతరులకు హామీ పత్రాలపై సంతకాలు చేయకండి. కళత్ర సలహాలు అవసరమౌతాయి. స్పెక్యులేషన్ లాభించదు. బంధుమిత్రుల సహాయ సహకారాలుంటాయి. విద్యార్థులు ప్రణాళికాబద్ధంగా వుండి గెలుపు దిశగా పయనిస్తారు. వ్యవసాయదారులకు ఆత్మ విశ్వాసంతో విజయప్రాప్తి. ధనాదాయం వుంటుంది.




తలపెట్టిన పనులలో తరచూ జాప్యం. రుణదాతల బెడద ఏర్పడుట. శరీర అలసట. ఇంట్లో చేసే శుభకార్యాలకు భంగాలు. వృత్తి, వ్యాపార ఆర్థికాదాయాలు సామాన్యం. విద్యార్థులలో అధర్మ ప్రయత్నాలు పెరగగలవు జాగ్రత్త పాటించాలి. వ్యవసాయదారులు వ్యవసాయపనులకై నూతన ఆలోచనలు చేస్తారు. కళా, క్రీడా రంగాల వారికి వ్యతిరేక రోజులు. రాజకీయులకు అనుకూలమైన కాలం కాదు.

## పంచాంగం

12తేది పుష్య మాస ప్రారంభం. వివేకానంద జయంతి.
13తేది భోగి.
14తేది సంక్రాంతి పండుగ. ఉత్తరాయణ ప్రారంభం.
15తేది కనుమ పండుగ, ప్రభలతీర్థం, పక్షి పూజ.
16తేది ముక్కనుమ - బొమ్మల నోము.
17తేది కుమార షష్ఠి.

### శుభ ముహూర్తాలు

13, 14, 15తేదిలలో అన్నప్రాసన, సీమంత, పెండ్లిచూపులు, ఊయల వేయుటకు మరియు సామాన్య వ్యవహారాలకు ముహూర్తాలున్నాయి.

### జనవరి తిథులు

#### పుష్య శుద్ధ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 12 | శని | పాడ్యమి | రా | 10.02 | గం.ల.వ |
| 13 | ఆది | విదియ | సా | 07.17 | గం.ల.వ |
| 14 | సోమ | తదియ | సా | 05.06 | గం.ల.వ |
| 15 | మంగళ | చవితి | ప | 03.38 | గం.ల.వ |
| 16 | బుధ | పంచమి | ప | 03.01 | గం.ల.వ |
| 17 | గురు | షష్ఠి | ప | 03.16 | గం.ల.వ |
| 18 | శుక్ర | సప్తమి | సా | 04.22 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




ఈవారం నూతన గృహ నిర్మాణాదులకు లేదా మరమ్మత్తులకు ధన వ్యయం చేస్తారు. గతంలో కుదుర్చుకొన్న అంగీకార ఒప్పందాలు నెరవేరవు. కుటుంబంలో కలతలు సర్దుమణుగుతాయి. ఇంట్లో చేసే శుభకార్య యత్నాలకు తర్జనభర్జనలు, ప్రయత్న పూర్వకంగా కార్యసిద్ధి. వృత్తి, వ్యాపారాలు అనుకూలిస్తాయి. విద్యార్థులు అనవసర వ్యవహారాలకు పోయి సంజాయిషీలు, శిక్షలు వుంటాయి.




శ్రమ, తిప్పట అధికం. మానసిక ప్రశాంతత తగ్గుదల. స్త్రీల విషయంలో రహస్య చర్చలకు తావివ్వవద్దు. కుటుంబంలో జరిగే వివాహాది శుభకార్య యత్నాలకు తోబుట్టువుల సహాయం వుంటుంది. వృత్తి, వ్యాపారాలు బాగుంటాయి. విద్యార్థుల మనోవాంఛలు ఫలిస్తాయి. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం లభిస్తుంది. రాజకీయ నాయకులు ఊహలకు అవకాశం ఇవ్వవద్దు.




తలపెట్టిన పనులలో కొన్నింటిపై పంతాలు, పట్టింపులు, మనో సంకటాలు పెరుగుతాయి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయంలో లేనిపోని అనుమానాలు బాధిస్తాయి. విశ్రాంతి చాలా అవసరం. రుణ ఒత్తిడి తగ్గుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులు ముఖ్య వ్యవహారాలలో శీఘ్ర నిర్ణయం తీసుకొంటారు. కళా, క్రీడా రంగాలలోని వారికి ప్రతి పనిలో నాన్చుడు.




చేస్తున్న పనులలో కొన్ని చిక్కుసమస్యలు చేధిస్తారు. మీరనుకున్న పనులన్నీ ఫలిస్తాయి. కుటుంబంలో శుభకర యత్నాలు ఫలిస్తాయి. తీర్థయాత్రలు లేదా దైవదర్శనం చేస్తారు. అకాల భోజనాలు, ధన నష్టం. వృత్తి, వ్యాపారులు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. విద్యార్థులకు చదువులో విజయ వార్తాశ్రవణం వుంటుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. రాజకీయులకు తోటివర్గాలతో విభేదాలు తగ్గుతాయి.




పనులలో ఆటంకాలున్నప్పటికీ చిక్కు సమస్యల్ని చేధిస్తారు. అనుకున్న పనులు సకాలంలో పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయం తగ్గుతుంది. ఉద్యోగులు అధికారులు, అనధికారులతో జాగ్రత్తగా మాట్లాడండి. విద్యార్థులు తమ వాగ్ధోరణిని తగ్గించాలి. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. కళా, క్రీడా రంగాలలోని వారు వృత్తిపరమైన సమస్యలు ఎదుర్కొంటారు.




ఈవారం అనుకూలతలు పెరిగి, కొన్ని సమస్యలు తగ్గుతాయి. పనుల ఒత్తిడిచే శరీర సౌఖ్యాలకు తావివ్వరు. కుటుంబంలో మీ నిర్ణయాలపై వ్యతిరేకత అధికంగా వుంటుంది. స్పెక్యులేషన్ లాభించదు. సంతాన విషయంలో అనుకున్నవి ఆలస్యంగా పూర్తి చేస్తారు. వ్యాపారాలు సామాన్యం. స్వయంవృత్తులవారికి లాభాకరం. విద్యార్థులకు మానసిక చాంచల్యం తగ్గుతుంది.

# ఈశాన్యంలో చీపురు పుల్లయినా ఉంచకూడదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.మాలకొండమ్మ — వింజమూరు*

* *రోలు, తిరుగలి ఈశాన్యంలో పెడితే అనారోగ్యాలు ప్రారంభమవుతాయా?*

ఈశాన్యం 'శివస్థానం' చీపురు పుల్లయినా ఉండకూడదు. పై గృహవస్తువులు పడమర స్థానంలో ఏర్పాటు చేయండి.

*పి.రజనీకుమారి — గుంటూరు*

* *శుభ ముహూర్తాలు నిర్ణయించి చేసిన వివాహాలు ఎందుకు విఫలమవుతున్నాయి?*

'బ్రహ్మ విద్య సూత్రాలు' గ్రంథంలో వివాహ ఫలితాలు, లగ్న, తార, గ్రహబలాలపై ఆధారపడి ఉంటాయన్న వివరణ ఉంది. జ్యోతిష శాస్త్రం వధూవరుల భవిష్యత్తుకు అనేక కారణాలను వివరించింది.

*డాక్టర్ ఎన్.భారతి — బెంగుళూరు*

* *మా ప్రక్కింటి అమ్మాయి ఆత్మహత్య చేసుకుని దెయ్యమై పీడిస్తోందట. నిజమేనా?*

ఆత్మలు, పిశాచవేధలను గురించి విశ్వామిత్ర వాస్తు సకారణంగా వివరించింది. అర్థాంతరంగా మరణించిన వారు పిశాచులవుతారని చాలా గ్రంథాలు ఖచ్చితంగా చెబుతున్నాయి.

*సయ్యద్ హుస్సేని — సికింద్రాబాద్*

* *పశువులను వధించిన వారికి దోషం అంటదా?*

వయసులో వున్న పశువుల్ని వధిస్తే 'సంవేదనా ఆత్మదోషం'. దూడల్ని వధిస్తే 'బాలారిష్ట భూతదోషం' ఏర్పడుతుందని 'ధర్మసూత్రాలు' చెబుతున్నాయి.

*ఎం.సుబ్బారావు — నెల్లూరు*

* *అపార్టుమెంటులో వాస్తును సరిచేసుకొనే విధానాన్ని చెప్పండి?*

నిర్మాణ సమయంలోనే వాస్తు సిద్ధాంతికి చూపి ప్లాటును సరిచేసుకోవాలి. పూర్తి వాస్తు అసాధ్యం గనుక సంబంధిత యంత్ర ప్రతిష్ట విధిగా చేసుకోవాలి.

*డాక్టర్ పాండే — బెంగుళూరు*

* *శాస్త్రాలలో 'మనువు' జీవితకాలం ఎంత? ఇతర వివరాలు చెప్పండి?*

మనువు జీవితకాలాన్ని గురించి హిందూ ధర్మశాస్త్రాలు ఏక కాలాన్ని చెప్పాయి. అది 311040000లు. ఈ కాలాన్ని పద్నాలుగు మనువుల కాలంగానూ నిర్ణయించారు.

*ఎం.ఉమరఫీఖాన్ — హైదరాబాద్*

* *తలుపుకు కిటికీలు తప్పక రావాలా? రాకపోయినా పర్వాలేదా?*

సింహ ద్వారానికి రెండు వైపులా కిటికీలు రావాలని, కనీసం ప్రక్కగది వీధివైపు కిటికీ కలిగి ఉండాలని వాస్తుసారమనే గ్రంథం చెబుతోంది. ఇట్లా రాకపోతే గృహస్థు 'కవాట వేధో దోషానికి' గురి అవుతాడు.

*డాక్టర్ శిరీష — చెన్నై*

* *'నాగదోషం' గురించి చెప్పండి?*

వ్యక్తి జీవితంలో సంతాన స్థానం పంచమంలో రాహువున్నప్పుడు కుజుడి చూపు ఏర్పడినప్పుడు నాగదోషం ఏర్పడుతుందని వశిష్ఠ ధర్మ సింధువు చెబుతున్నది.

*డాక్టర్ శంకర్ — చెన్నై*

* *జ్యోతిషంలో నవాంశ, రాశులు ఏవి ముఖ్యమైనవి?*

రెండూ కూడా ముఖ్యమైనవే. అయితే భావ, రాశి చక్రాలు వేరు వేరు. జాతకంలో రాశుల బదులు ద్వాదశ భావాలను గుర్తించినప్పుడే ఖచ్చితమైన ఫలితాలు వస్తాయి.

*ఆర్.శంభుప్రసాద్ — కావలి*

* *గృహప్రవేశం పూజారి సక్రమంగా చేయలేదు.*

ముహూర్తబలం, దినబలం, భార్యాభర్తల నక్షత్ర బలం ముఖ్యం. పూజారి నిర్వహణ సక్రమమే. మీకు తృప్తికలగడంలో శాస్త్రంలో ముఖ్యం కాదు.

*సి.భవాని — గూడూరు*

* *కార్యక్రమ నిర్వహణలో లోపాలు గృహస్తుకు సమస్యల్ని తెస్తాయా?*

శుభకార్యక్రమంలో అమృత ఘడియల్ని మించిన ఫలం మరొకటి లేదు. అనవసరంగా మీరు గురు నింద, శాస్త్ర నింద వేసి పాపం మూట గట్టుకుంటున్నారు.

# గందరగోళంగా కోవూరు షుగర్ ఫ్యాక్టరీ నిర్వహణ!

**కోవూరు షుగర్ ఫ్యాక్టరీ నిర్వహణ అస్తవ్యస్తంగా తయారయ్యింది. డిశంబర్ నెలలో ప్రారంభం కావాల్సిన క్రషింగ్ ప్రారంభమవలేదు. రైతులకు చెల్లించాల్సిన పాత బకాయిలూ పేరుకుపోయి ఉన్నాయి. తమ ఇబ్బందులు రైతులు చెప్పుకోవాలంటే వినే నాథుడు లేడు.**



నిత్యం వివాదాల్లో కోవూరు షుగర్ ఫ్యాక్టరీ.

జిల్లాలో సహకార రంగం పరిధిలో నడుస్తున్న కోవూరు షుగర్ ఫ్యాక్టరీ నిర్వహణ తీరుపై రైతులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. ప్రతి సంవత్సరం డిశంబర్ ఆఖరులో ఫ్యాక్టరీలో క్రషింగ్ ప్రారంభిస్తుంటారు. అయితే గత నెలలో ప్రారంభం కావాల్సిన క్రషింగ్ అధికారుల నిర్లక్ష్యం కారణంగా వాయిదా పడింది. క్రషింగ్‌కు అవసరమైన చెరకును రైతులు ఫ్యాక్టరీకి తరలించడం జరిగింది. కానీ వారాలు గడుస్తున్నా రైతులు తీసుకొచ్చిన చెరకును తూకం వేయకుండా కాలయాపన చేస్తుండడంతో అది కాస్త ఎండి పోతోంది. దీంతో రైతులు తాము ఆర్థికంగా ఇబ్బంది పడాల్సి వస్తుందని ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

కోవూరు షుగర్ ఫ్యాక్టరీని నమ్ముకుని వేలాది ఎకరాల్లో చెరకు సాగు చేసిన రైతులు దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. ఫ్యాక్టరీ యాజమాన్యంతో పలు దఫాలు చర్చలు జరిపినప్పటికీ సాంకేతిక కారణాలు చూపి క్రషింగ్ ప్రారంభించలేదని రైతులు ఆరోపిస్తున్నారు. ఈ ఫ్యాక్టరీకి అనుబంధంగా బుచ్చి, కోవూరు, కొడవలూరు, విడవలూరు, ఇందుకూరుపేట తదితర మండలాలున్నాయి. ఈ మండలాల్లో క్రషింగ్‌కు అవసరమైన చెరకు ఎంత సాగు చేయాలన్న దానిపై ముందుగానే అధికారులు రైతులకు సూచనలు, సలహాలిస్తారు. అధికారులు సూచించిన విధంగానే సాగుచేసి తీరా చెరకును ఫ్యాక్టరీకి తీసుకొస్తే అనుకున్న సమయానికి క్రషింగ్ ప్రారంభించలేదన్న సమాచారం తెలుసుకుని ఆవేదన చెందుతున్నారు. ఎంతో చరిత్ర కలిగిన కోవూరు షుగర్ ఫ్యాక్టరీ ప్రస్తుత యాజమాన్యం నిర్లక్ష్య వైఖరి కారణంగా రైతుల నుంచి ఆదరణ కోల్పోయే స్థితికి చేరింది.

### బకాయిల చెల్లింపు జరగలేదు

కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి గత సీజన్‌లో చెరకు సరఫరా చేసిన రైతులకు చెల్లించాల్సిన బకాయిలపై జిల్లా మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి ఇచ్చిన హామీ నిలబెట్టుకోలేక పోయారు. ఫ్యాక్టరీ యాజమాన్యం దాదాపు 25 కోట్ల రూపాయలకుపైగా బకాయిలు చెల్లించాల్సి ఉంది. గత ఆరు నెలల నుంచి బకాయిల కోసం రైతులు వివిధ రూపాల్లో ఆందోళన చేపట్టి జిల్లా కలెక్టర్ నుంచి రాష్ట్ర ముఖ్యమంత్రి వరకు వినతి పత్రాలు సమర్పించి బకాయిలు చెల్లించాలని విజ్ఞప్తి చేశారు.

రైతుల బాధలను అర్థం చేసుకున్న కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి డిశంబర్ 24 నుంచి ఆమరణ నిరాహార దీక్ష చేపట్టాలని నిర్ణయించి ఈ మేరకు ప్రకటన కూడా చేశారు. జిల్లా సమీక్షా మండలి(డిఆర్సీ) సమావేశానికి హాజరైన జిల్లా మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి డిశంబర్ 28వ తేది నాటికి షుగర్ ఫ్యాక్టరీకి దాదాపు 11 కోట్ల రూపాయలు ప్రభుత్వం విడుదల చేస్తుందని హామీ ఇవ్వడం జరిగింది. మంత్రి హామీతో నిరాహార దీక్ష కార్యక్రమాన్ని ఎమ్మెల్యే వాయిదా వేసుకున్నారు. అయితే మంత్రి ఇచ్చిన హామీ మేరకు బకాయిలు విడుదల కాకపోవడంతో రైతులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. అసలు బకాయిలు చెల్లిస్తారా? లేదా అన్న అనుమానాలను వ్యక్తం చేస్తున్నారు.

ప్రస్తుత ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టర్ అవలంభిస్తున్న విధానాలే ఫ్యాక్టరీ నష్టాలకు కారణమన్న అభిప్రాయం వ్యక్తపరుస్తున్నారు. యాజమాన్యంతో కార్మికులు, రైతులకు విభేదాలు తలెత్తడంతో దాని భవిష్యత్తు ప్రశ్నార్థకంగా మారే అవకాశం ఉంది. గత వారంలో యాజమాన్యం రైతులతో ఫ్యాక్టరీ ఆవరణలో సమావేశం నిర్వహించింది. బకాయిల చెల్లింపు కోసం ప్రభుత్వం నిధులు మంజూరు చేసిందని త్వరలో వాటిని రైతులకు పంపిణీ చేస్తామని మేనేజింగ్ డైరక్టర్ సుధాకర్‌రెడ్డి హామీ ఇచ్చారు. రైతులకు చెల్లించాల్సిన మొత్తం బకాయిలు 25 కోట్ల రూపాయలు కాగా ప్రభుత్వం 11 కోట్ల రూపాయలు ఇస్తే మిగిలిన బకాయిల మాటేమిటని రైతులు ప్రశ్నించారు. రైతుల ప్రశ్నలకు స్పష్టమైన సమాధానం చెప్పలేక సమావేశాన్ని మధ్యలో ముగించారు. ప్రభుత్వం స్పందించకుంటే చెరకు రైతులు మరింత నష్టాలను చవి చూడాల్సి ఉంటుంది.

దుస్థితిలో హాస్టళ్లు

# వసతి గృహాల్లో కానరాని అభివృద్ధి!

> దరిదాపులు అన్ని సంక్షేమ శాఖల ఆధ్వర్యంలో నడిచే వసతి గృహాల్లో సంక్షేమం మచ్చుకైనా కానరావడం లేదు. తనిఖీలకు వెళ్తున్న అధికారులు విద్యార్థులతో కలసి భోజనం చేయడం, రాత్రి సమయాల్లో అక్కడే నిద్రించడం మినహా సమస్యల పరిష్కారానికి కృషి చేయడం లేదు.



కొండాయపాళెం గేటు వద్ద ఉన్న హాస్టల్‌లో అధ్వాన్నంగా ఉన్న స్నానపు గదులు.

రాష్ట్ర ప్రభుత్వం సంక్షేమ శాఖ వసతి గృహాల్లోని విద్యార్థులకు మెస్ ఛార్జీలను పెంచినప్పటికీ మెనూలో కోత తప్పడం లేదు. వసతి గృహాల్లోని విద్యార్థులకు నాణ్యమైన భోజనం పెట్టాలన్న సంకల్పంతో ప్రభుత్వం గతంలో ఉన్న మెస్ ఛార్జీలను 60 శాతానికి పైగా పెంచడం జరిగింది. పెంచిన మెస్ ఛార్జీలను డిసెంబర్ 10వ తేది నుంచి అమలు చేయాలని ఆదేశాలు కూడా జారీ అయ్యాయి. కానీ వసతి గృహాల వార్డెన్లు మాత్రం గతంలో పెడుతున్న ఆహార పదార్థాలనే నేటికి పెడుతూ విద్యార్థులు ఆకలితో అలమటించేలా చేస్తున్నారు. ఏ వసతి గృహంలోనూ కొత్తగా పెంచిన మెస్ ఛార్జీలకు అనుగుణంగా మెనూ అమలు కావడం లేదు. వసతి గృహాల్లోని విద్యార్థులు వార్డెన్లను ప్రశ్నించలేక ఇబ్బంది పడుతున్నారు.

జిల్లాలో సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో 149 వసతి గృహాలు నడుస్తున్నాయి. వీటిలో 95 బాలుర వసతి గృహాలు కాగా, 54 బాలికలు వసతి గృహాలున్నాయి. గిరిజన సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో 24 వసతి గృహాలున్నాయి. వీటిలో 18 బాలురవి, 6 బాలికలవి ఉన్నాయి. వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో 86 వసతి గృహాలు నడుస్తున్నాయి. వీటిలో బాలురవి 66, బాలికలవి 20 ఉన్నాయి. సాంఘిక సంక్షేమ వసతి గృహాల్లో 12,206 మంది విద్యార్థులు, గిరిజన సంక్షేమ శాఖ వసతి గృహాల్లో 1905 మంది, వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ వసతి గృహాల్లో 8,034 మంది విద్యార్థులు ప్రవేశం పొంది ఉన్నారు. మూడు సంక్షేమ శాఖల్లో కలిపి 22,145 మంది ఉండగా, అనుబంధ కళాశాలల వసతి గృహాల్లో మరో 1085 మంది విద్యార్థులు వసతి పొందుతున్నారు.

ప్రభుత్వం ఇటీవల పెంచిన మెస్ ఛార్జీల ప్రకారం 3వ తరగతి నుంచి 7వ తరగతి వరకు 750 రూపాయలు, 8వ తరగతి నుండి 10వ తరగతి వరకు 850 రూపాయలు ఇక నుంచి ఖర్చు చేయాల్సి ఉంటుంది. వసతి గృహ విద్యార్థులకు మధ్యాహ్నం భోజనం వారు చదివే పాఠశాలల్లోనే పెడుతున్నారు. సెలవు దినాల్లో మినహా మిగిలిన అన్ని రోజుల్లో ఉదయం, సాయంత్రం మాత్రమే వసతి గృహాల్లో భోజనం పెడుతున్నారు. రెండు పూటలా వడ్డించే భోజనం నాణ్యతగా పెట్టడం లేదు. ప్రభుత్వం ఎస్సీ, ఎస్టీ, బిసి విద్యార్థుల సంక్షేమ కోసం ప్రతి సంవత్సరం కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నా అధికారుల నిర్లక్ష్యం, వార్డెన్ల అవినీతి అక్రమాల కారణంగా ఆశించిన ఫలితాలు రావడం లేదు. వసతి గృహ విద్యార్థుల గురించి కొంత మంది వార్డెన్లు అసలు పట్టించుకోవడం లేదు.

వసతి గృహాల్లో అవసరమైన సదుపాయాలు లేకపోవడంతో ఇక్కడ ఉండేందుకు విద్యార్థులు ఇష్టపడక మధ్యలోనే ఇళ్లకు వెళ్లిపోతున్నారు. ముఖ్యంగా బాలికలు ఉండే వసతి గృహాల్లో త్రాగునీటి సరఫరా, మరుగుదొడ్ల సమస్యలు పట్టిపీడిస్తున్నాయి. పారిశుద్ధ్యం పూర్తిగా లోపిస్తుండడంతో అంటువ్యాధులు వ్యాపించి వ్యాధులబారిన పడుతున్నారు. బాలికల ఆరోగ్య సమస్యలపై పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. కేవలం మేట్రిన్లు, వార్డెన్లు వసతి గృహాలకు వెళ్లి రేషన్ ఇచ్చి వెళుతుంటారు తప్ప విద్యార్థులు ఎదుర్కొంటున్న సమస్యలు ఏమిటి? అన్న విషయం గురించి ఆలోచించరు. ప్రభుత్వం ఎంత మెస్ ఛార్జీలను పెంచితే అందుకు తగ్గట్టుగా అధికారులకు కమిషన్లు ముట్టజెప్పాల్సి ఉంటుందని కొందరు అభిప్రాయపడుతున్నారు.

అన్ని సంక్షేమ శాఖల ఆధ్వర్యంలో నడిచే వసతి గృహాల్లో ఇదే తంతు కొనసాగుతుంది. తనిఖీలకు వెళుతున్న అధికారులు విద్యార్థులతో కలసి భోజనం చేయడం, రాత్రి సమయంలో అక్కడే నిద్రించడం తప్ప సమస్యలను పరిష్కరించేందుకు కృషి చేయలేక పోతున్నారన్న విమర్శలున్నాయి. ఇప్పటికైనా అధికారులు స్పందించి కమీషన్లకు స్వస్తి పలికి విద్యార్థుల సంక్షేమం, చదువుల పట్ల దృష్టి సారించాల్సిన అవసరం ఉంది.



## ఐటెమ్‌పాటలో దీపిక!

త్రివిక్రమ్ దర్శకత్వంలో పవన్‌కళ్యాణ్ నటించే చిత్రం త్వరలోనే సెట్స్ మీదకు వెళ్లబో తోంది. ఈ సినిమాలో సమంత కథానాయిక. బీవీఎస్ఎన్ ప్రసాద్ నిర్మాత. స్పెయిన్‌లో చిత్రీకరణ చేయబోతున్నారు. ఇందులో ఓ ప్రత్యేక గీతం ఉం టుంది. ఈ పాటలో ప్రముఖ హిందీ హీరోయిన్ దీపికా పదు కొణె నృత్యం చేస్తుందని ఫిల్మ్‌న గర్ వర్గాలు చెబుతున్నాయి. ఇప్పటికే ఈ విషయమై చిత్ర బృందం ఆమెతో చర్చించినట్లు సమాచారం. దీపిక గతంలో ఓ తెలుగు చిత్రంలో నర్తించింది. 'లవ్ 4 యు' అనే ఆ సినిమాకు జయంత్ సి.పరాన్జీ దర్శ కుడు. అయితే ఆ సినిమా విడుదలకు నోచుకోలేదు.

## జీవిత చరిత్ర వ్రాసిన షకీలా!



జీవిత చరిత్ర అంటే అర్థం లేకుండా పోయింది. ఎవరు పడితే వాళ్లు తమ జీవిత చరిత్రలు వ్రాసేస్తున్నారు. నెల్లూరియారాలు శృంగార తార షకీలాకు కేరాఫ్ అడ్రస్ సెక్స్ సినిమాలు. మళయాళ సూపర్ స్టార్లు సైతం షకీలా చిత్రం విడుదలవుతుందంటే తమ చిత్రాల విడుదలను ఆపుకొన్న చరిత్ర ఉంది. ఆ లెవల్లో ఖంగు తినిపించింది ఈ శృంగార తార. గత కొన్నేళ్లుగా ఆమె శృంగార చిత్రాలకు దూరంగా ఉంటోంది. షకీలాను ఒక ఫైనాన్షియర్ పెళ్లి చేసుకుంటా నంటే షకీలా అంగీకరించలేదు. జీవిత చరిత్ర వ్రాస్తున్నాలే ఆ తర్వాత చూస్తా నందట. 250 పేజీలతో తయారవుతున్న ఈ పుస్తకంలో షకీలాకు సంబంధిం చిన చిన్ననాటి విశేషాలు, లవ్ ఎఫైర్లు, మద్యానికి ఏ విధంగా తాను బానిస య్యిందో కూడా వివరంగా వ్రాసిందట. ఈ నెలలోనే విడుదలయ్యే ఈ పుస్తకం కోసం మళయాళ, తెలుగు, తమిళ పరిశ్రమ వర్గాలు ఎదురు చూస్తున్నాయి.

## అయ్యో... హరిప్రియ!

తకిట తకిట, పిల్ల జమీందార్ చిత్రాల్లో హీరోయిన్ హరిప్రియకు తెలుగులో పెద్దగా గుర్తింపు లేకపోయినా తమిళంలో మాత్రం క్రేజ్ ఉంది. ఇటీవల ఓ తమిళ చిత్రంలో ఆమెను జలకాలాడే సన్నివేశంలో నటించమని దర్శకుడు అడిగాడట. రోజులు బాగా లేవు. నేను చేయనందట. దర్శకుడు సీన్ డిమాండ్ అంటూ ఒత్తిడి చేయడంతో ఓకె అందట. అయితే కెమెరామెన్‌నుగాక దర్శకుడినే ఈ సన్నివేశాన్ని చిత్రీకరించమందట. దర్శకుడు ఆ పనిలో ఉండగా సహాయ దర్శకుడు సెల్‌ఫోన్‌లో ఈ సన్నివేశాన్ని చిత్రీ కరించి కొందరికి అమ్మచూపగా ఈ విషయం హరిప్రియ చెవికి సోకింది. వెంటనే ఆమె దర్శకునికి చీవాట్లు పెట్టగా సహాయ దర్శకుని సెల్‌ఫోన్ తెప్పించి ఆ బోల్డ్ సన్ని వేశాలన్నీ డిలిట్ చేయడంతోపాటు సినిమా కోసం తనపై చిత్రీకరించిన ఆ పాదు రీళ్లు కాల్చివేసేలా చేయడంపై చెన్నైలో పెద్ద చర్చ జరుగుతుంది.

## విలన్‌గా రానా?



కృష్ణం వందే జగద్గురుమ్‌తో ఇటీవల సందడి చేసిన హీరో దగ్గుబాటి రానా తెలుగు సినిమాలకే పరిమి తం కాకుండా అటు తమిళం ఇటు హిందీలోనూ ఆయన నటిస్తున్నారు. త్వరలో శ్రీరాఘవ దర్శకత్వంలో ఓ చిత్రంలో చేస్తున్నారు. ఇది తెలుగు, తమిళ భాషల్లో రూపొందబోతోంది. అలాగే అజిత్ నటించే సినిమా లోనూ రానా కీలకపాత్ర పోషిస్తున్నారు. తెలుగులో ఓ ప్రముఖ దర్శకుడి చిత్రంలో రానా ప్రతి నాయకునిగా నటించే అవకాశాలున్నాయని సమాచారం. ఆరడుగు లతో... మిర్చి అంత ఘాటుగా కనిపించే ఓ హీరో సినిమా అది. ఇందులో విలన్ పాత్రను రానాకు ఆఫర్ చేశారట. ఈ విషయమై త్వరలోనే ఓ స్పష్టత వస్తుంది.



## టబుకు పెళ్లి!

టబు ఒకప్పుడు మంచి సెక్సీ హీరో యిన్. కూలీ నెం.1, నిన్నే పెళ్లాడుతా చిత్రాల్లో టబును చూసిన యువతరం అలాంటి పెళ్లాం ఉంటే చాలనుకొనేవారు. అంత బాగుండేది టబు. ఈమెది హైదరాబాద్ అయినా ముంబాయిలో స్థిరపడింది. టబుకి పెళ్లి వయసు దాటి పదేళ్లయ్యింది. ఎవరు పెళ్లి గూర్చి అడిగినా చిన్న నవ్వు నవ్వి సరిపెట్టేది. హీరో నాగార్జునతో ఈమె చివరికి సెటిల్ అవుతుందనే టాక్ పరిశ్రమలోనూ ఉండేది. అటువంటి టబు స్వరం మారింది. నాకు కావాల్సినంత పరిపక్వత వచ్చింది. సొంతంగా నిర్ణయాలు తీసుకునే స్థాయికి ఎదిగాను. పెళ్లి చేసుకోవాలనుకొంటాన్నానంటుంది. ఈ మధ్య కళ తప్పిన హీరోయిన్లు బిజి నెస్‌మెన్‌లను పెళ్లి చేసుకొన్నట్లు టబు కూడా ఎవరో ఒకరిని చూసుకొని ఈ మాట అంటుందంటున్నారు. కొన్నాళ్లు ఆగితే అతనెవరో చెబుతానంటుంది ఈ అమ్మడు.

## పచ్చబొట్ల బన్నీ!



యువతరానికి పచ్చ బొట్లు అంటే భలేక్రేజ్. సిటీ యూత్ రకరకాల డిజైన్లలో టాటూస్ వేయించుకొంటోంది. ఇప్పుడు యువ హీరో అల్లు అర్జున్ కూడా పచ్చబొట్లు పొడిపించుకొన్నాడు. తన తాజా చిత్రాలలో వాటితో కనిపిస్తాడని తెలిసింది. ఆయన ఇద్దర మ్మాయిలు అనే సినిమాలో నటిస్తున్నాడు. అమలాపాల్, కేథరీన్ హీరోయిన్లు. పూరిజగన్నాథ్ దర్శకుడు. ఈ చిత్ర దర్శకుడు ఒం టిపై బోలెడు టాటూస్ ఉంటాయి. ఆ స్ఫూర్తితోనే బన్నీ కూడా టాటూస్ వేయించుకొని ఉంటాడని ఫిల్మ్‌నగర్ వర్గాలు అంటు న్నాయి. ఈ సినిమా త్వరలోనే బ్యాంకాక్‌లో మొదలవుతుంది. వేసవిలో విడుదల చేసేందుకు ప్రణాళికలు సిద్ధం చేస్తున్నారు.



## శింబు తెలుగుపాట!

సకల కళావల్లభుడు అనేమాట తమిళ హీరో శింబుకి సరిపోతుంది. ఆయన కేవలం నటనకే పరిమితం కావడం లేదు. దర్శకత్వం మీద అవగాహన ఉంది. కథలు రాస్తాడు. పాటలు పాడుతాడు. ఈ మధ్యనే బాణీలు కూడా కడుతున్నాడు. నేరుగా తెలుగులో నటించకపోయినా... మనభాష మాట్లాడగ లడు. ఇప్పుడు పాట పాడేందుకు సన్నద్ధమ వుతున్నాడని సమాచారం. శింబు స్నేహితుడు మహత్ హీరోగా నటిస్తున్న తెలుగుచిత్రం బ్యాక్ బెంచ్ స్టూడెంట్‌కు మధుర శ్రీధర్ దర్శ కత్వం వహిస్తున్నాడు. ఇందులో ఓ పాటను శింబు పాడుతాడని తెలిసింది. 'కొలవెరిడీ'తో ప్రాచుర్యం పొందిన అనిరుధ్ రవిచంద్రన్ సంగీతం ఈ చిత్రానికి సమకూరుస్తున్నాడు.

## ఇల్లు కొన్న అంజలి!

షాపింగ్‌మాల్, జర్నీ చిత్రాలలో హీరోయిన్‌గా చేసిన అం జలి వెంకటేష్ సరసన సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు చిత్రంలో నటిస్తుంది. ఐదు పదులు నిండిన హీరోతో నటిస్తే యంగ్ హీరో లతో భవిష్యత్తులో ఛాన్సొరాదని పలువురు చెప్పినా అంజలి లెక్క చేయలే దట. తాను అద్దెకున్న ఇల్లు కలిసి వచ్చిందని అందువల్లే పెద్ద సినిమాలో నటించే అవకాశం వచ్చిందని దిల్ రాజు ఇచ్చిన పారితోషి కంతో ఆ ఇంటిని కొన్నదట. సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు విడుదల య్యాక తెలుగులో మంచి అవకా శాలు వస్తాయన్న ధీమా వ్యక్తం చేస్తుంది అంజలి.





## హరీష్ శంకర్ చెంపచెళ్లు?

గబ్బర్‌సింగ్ హిట్‌తో ఆ చిత్ర దర్శకుడు హరీష్ శంకర్ అగ్ర దర్శకుల లిస్ట్‌లో చేరాడు. ఈ మధ్య వోడ్కా విత్ వర్మ పుస్తకావిష్కరణ సభ హైదరాబాద్‌లో జరిగింది. ఆ తర్వాత జరిగిన మందు పార్టీలో హీరోయిన్ ఛార్మీని ఉద్దేశించి హరీష్ శంకర్ అసహ్యంగా మాట్లాడాడట. అంతే ఛార్మి ఆయన చెంప చెళ్లుమనిపించి అక్కడ నుంచి విసవిసా వెళ్లిపోయింది. కొందరు సినీ పెద్దలిచ్చిన సలహా మేరకు హరీష్ శంకర్ ఈ ఘటనపై ఛార్మి ఇంటి కెళ్లి ఆమెను కలిసి క్షమాపణ కోరడంతో శాంతించిందని ఫిల్మ్‌నగర్‌లో ఒకటే పుకార్లు షికార్లు చేస్తున్నాయి.

# శిశు సంరక్షణ కేంద్రం ప్రారంభానికి గ్రహణం!


ఈ షెట్టర్లు ఎప్పటికి తెరుచుకుంటాయో?

● ఇబ్బందిపడుతున్న సామాన్య జనం!

చిన్నారులకు మెరుగైన వైద్యం అందించేందుకు నగర నడిబొడ్డులో గల జూబ్లీ ఆస్పత్రిలో ఆధునిక సౌకర్యాలతో ఏర్పాటుచేసిన నవ జాతా శిశు సంరక్షణ కేంద్రం ప్రారంభానికి నోచుకో లేదు. పురిటి బిడ్డలకు సత్వర వైద్యం అందించేందుకు లక్షల రూపాయలు వెచ్చించి భవనాన్ని నిర్మించినప్పటికీ అది అందుబాటులోకి రాకపోవడంతో పేదలు పుట్టిన పిల్లలకు సోకే వివిధ వ్యాధులకు చికిత్స చేయించేందుకు ప్రైవేట్ ఆస్పత్రులకు వెళ్లాల్సి వస్తోంది. దశాబ్దాల క్రిందట ఏర్పాటైన జూబ్లీ హాస్పిటల్‌లో నగరానికి చెందిన వారితోపాటు జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చి పురుడు పోసుకొంటుంటారు. వీరిలో అధిక భాగం పిల్లలు కామెర్ల వ్యాధితో పుట్టడం, బరువు తక్కువగా ఉండడం, ప్రసవ సమయం కంటే ముందుగా జన్మించడం వంటి సమస్యలతో సతమతం అవుతుంటారు. ఇలాంటి వారికి తక్షణ వైద్యసేవలు అందించాల్సి ఉంటుంది. జూబ్లీ హాస్పిటల్‌కు వచ్చే వారిలో అధిక భాగం పేదలే ఉంటుంటారు. అలాంటి వారు పుట్టిన బిడ్డలకు అవసరమైన వైద్యం చేయించేందుకు ప్రైవేట్ ఆసుపత్రులకు వెళ్లాల్సి వస్తుండడంతో అక్కడి ఫీజులు విమానం మోత మోగిస్తుండడంతో సామాన్యులు భరించలేక పోతున్నారు. దీనిని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వ ఆసుపత్రిలోనే పిల్లల వైద్యానికి అవసరమైన చిన్న పిల్లల వైద్య కేంద్రాన్ని నిర్మించదలచారు. జూబ్లీ హాస్పిటల్‌లో దీనిని ఏర్పాటు చేసేందుకు మూడు కోట్ల రూపాయల నిధులు కేటాయించారు. 50 లక్షల రూపాయలు వెచ్చించి ఆస్పత్రి ప్రాంగణంలోనే అన్ని ఆధునిక వసతి సౌకర్యాలతో 20 పడకల ఆస్పత్రిని సిద్ధం చేశారు. ఆక్సిజన్ సౌకర్యం, సెంట్రలైజ్డ్ ఎయిర్ కండిషన్, వ్యాక్సిన్లు కొనుగోలు చేసి సిద్ధం చేశారు. వైద్య సేవలు అందించేందుకు నలుగురు చిన్న పిల్లల వైద్యులను, 14 మంది స్టాఫ్ నర్సులు, ల్యాబ్ టెక్నీషియన్, వాచ్‌మెన్‌లు, ఇతర సిబ్బందిని ఏర్పాటు చేశారు. వైద్యులకు ప్రత్యేకమైన శిక్షణనిచ్చారు. చిన్నారుల ప్రాణ రక్షణకు అవసరమైన అన్ని ఏర్పాట్లు చేసినప్పటికీ ప్రారంభోత్సవానికి నోచుకోకపోవడంతో ఈ కేంద్రం ఏర్పాటు బూడిదలో పోసిన పన్నీరవుతోంది. ఫలితంగా పిల్లల తల్లితండ్రులు చికిత్స కోసం ప్రైవేట్ ఆస్పత్రులను ఆశ్రయించాల్సి వస్తుంది. ఇక్కడ రోజుకు వేలాది రూపాయలు వసూలు చేస్తుండడంతో భరించలేక పోతున్నారు.

## వ్యాపార కేంద్రంగా మహిళా గ్రంథాలయం!

### నానాపాట్లు పడుతున్న పాఠకులు


గేటు ప్రక్కనే ఉన్న టెంట్‌లో కొనసాగుతున్న పుస్తక విక్రయ శాల.

విజ్ఞానాన్ని పెంపొందించేందుకు ఏర్పాటుచేసిన గ్రంథాలయం వ్యాపార కేంద్రంగా మారడం పలువురిని ఆవేదనకు గురి చేస్తోంది. నగరంలోని గాంధీనగర్ స్వతంత్ర పార్కు ప్రక్కన దొడ్ల పద్మావతమ్మ పేరుతో మహిళా గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశారు. పుస్తక పఠనంపై ఆసక్తిని పెంపొందించడం, మేధస్సును, విజ్ఞానాన్ని పుస్తకాల ద్వారా అందించడం ఈ గ్రంథాలయ ఏర్పాటు ముఖ్య ఉద్దేశం. నిత్యం ఎంతో మంది ఈ గ్రంథాలయానికి వచ్చి అందుబాటులో ఉన్న పత్రికలు, పుస్తకాలు చదువుతుంటారు. అలాంటి గ్రంథాలయం నేడు వ్యాపార కేంద్రంగా మారడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. గ్రంథాలయంకు ముందు ఖాళీ స్థలం ఉంది. పచ్చదనం కోసం ఈ ప్రదేశాన్ని వదిలారు. అయితే గత కొంత కాలంగా ఈ స్థలంలో పుస్తకాలు విక్రయించుకొనేందుకు ఒక సంస్థకు అనుమతివ్వడంతో ఏడాదికి పైగా ఆ సంస్థ వ్యాపారం నిర్వహిస్తుండడంతో గ్రంథాలయ వాతావరణమే పాడైపోయింది. ఒక వ్యక్తి ఇక్కడ పుస్తకాలను విక్రయిస్తున్నప్పటికీ పట్టించుకొనేవారే లేకుండా పోయారు. గ్రంథాలయ నిర్వాహకులతో లాలూచీ కుదుర్చుకొని స్వల్ప మొత్తం చెల్లించి పర్మినెంట్‌గా వ్యాపార కేంద్రాన్ని ఏర్పాటు చేసుకోవడంపై పెద్ద ఎత్తున విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఒకరికే రకరకాల పేర్లు మార్పిస్తూ వారినే కొనసాగిస్తున్నారనే ఆరోపణలు వినవస్తున్నాయి. అసలు గ్రంథాలయ ఆవరణ ఇలా ప్రైవేట్ వ్యక్తులకు వ్యాపారం చేసుకోను ఇవ్వొచ్చా అనే ప్రశ్నలు తలెత్తుతున్నాయి. పుస్తకాలు కొనేందుకు అక్కడకు వచ్చేవారికి నిశ్శబ్దంగా ఉండాల్సిన గ్రంథాలయ వాతావరణం దెబ్బతింటోందని పలువురు పఠనాసక్తి గల్గినవారు, గ్రంథాలయానికి వచ్చేవారు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. దీనిపై ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని వ్యాపార కేంద్రంగా మారిన గ్రంథాలయాన్ని కాపాడాలని పలువురు కోరుకొంటున్నారు.

## రాజీవ్ స్వగృహాలో సమస్యల తిష్ట!


గృహకల్ప ప్రాంగణంలో దుస్థితికి దర్పణం పట్టే దృశ్యం.

పేదలకు సొంతింటి కలను నిజం చేయాలన్న లక్ష్యంతో రాజీవ్ గృహకల్ప పథకం క్రింద నిర్మించిన అపార్టుమెంట్లు అసాంఘిక శక్తులు, చీకటి కార్యకలాపాలకు అడ్డాగా మారుతున్నాయి. రాజకీయ నేతల అండదండలు, పైరవీలతో అర్హులైన వారికి కాకుండా అనర్హులకే ఈ ఇళ్లను కేటాయించడంతో ఇక్కడి వాతావరణం అస్తవ్యస్తంగా మారింది. ఫలితంగా అసలైన పేదలు ఇలాంటి రౌడీమూకలు, అసాంఘిక కార్యకలాపాలకు పాల్పడే వారి కారణంగా తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఇరుగాళమ్మ ఆలయం సమీపంలో రాజీవ్ గృహకల్ప సముదాయాన్ని 2008లో నిర్మించారు. దీనిలో మొత్తం 475 ఫ్లాట్లున్నాయి. ఆనాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్ రెడ్డి ఈ గృహ సముదాయాన్ని ప్రారంభించారు. అర్హులైన వారిని గుర్తించి ఈ ఫ్లాట్లు కేటాయించాల్సి ఉండగా మితిమీరిన రాజకీయ జోక్యం, అక్రమాలు చోటు చేసుకోవడంతో పేదోళ్లకంటే పెద్దలే అధికంగా ఫ్లాట్లను దక్కించుకొన్న వారు వీటిని అద్దెకు ఇచ్చేశారు. ఈ గృహ సముదాయంలో ఫ్యాన్సీ, కూరగాయల అంగళ్లు ఏర్పాటు చేసుకొనగా, మరికొందరు ఈ ఇళ్లలో బయటి ప్రాంతాల నుంచి వ్యభిచారిణులను తీసుకొని వచ్చి వ్యభిచారం చేయించడంతోపాటు బెల్టు షాపులను ఏర్పాటు చేయడంతో ఎంతో ఉన్నతాశయంతో నిర్మించిన రాజీవ్ గృహకల్ప అసాంఘిక శక్తులకు, చీకటి కార్యకలాపాలకు అడ్డాగా మారింది. దీనికి తోడు పారిశుద్ధ్యం అస్తవ్యస్తంగా ఉంది. చెత్త పేరుకుపోవడం, పందుల సంచారం, దోమలు అధికం కావడంతో నివాసస్తులు గగ్గోలు పెడుతున్నారు.

## వేడి వేడిగా రాష్ట్ర రాజకీయాలు

మొదటి పేజీ కొరవ

రెడ్డి కూడా అధిష్టానం ఇష్టం అని సరిపెట్టాడే తప్ప ఇవ్వడానికి లేదనే వాదన విన్పించలేదు. అయినా సరే కేంద్ర నాయకత్వం రాష్ట్ర విభజనకు సిద్ధపడడం లేదని తెలుస్తున్నది. దేశంలోని ఇతర ప్రాంతాలలో తలెత్తే ఉద్యమాల భయంతో ఈ నిగ్రహం పాటిస్తున్నట్లు కన్పడుతున్నది.

తెలంగాణ ఏర్పాటు తప్ప అభివృద్ధి మండళ్లు, నిధులు ఉద్యమకారులను సంతృప్తిపరచలేవు. అయితే మూడేళ్ల క్రితం డిసెంబర్ 9తేది ప్రకటన నాటి పరిస్థితులు మాత్రం ఇప్పుడు లేవన్నది వాస్తవం. ఆనాడు రాష్ట్రంలో తీవ్ర ఉద్రిక్తత పరిస్థితి వుండింది. కెసిఆర్ చాలా బలంగా వుండినాడు. ఇప్పుడు ఉద్యమం ఆ స్థాయిలో నడవడం లేదు. కెసిఆర్ స్వయంగా గత ఏడాది కాలంగా ఉద్యమాన్ని మూట కట్టి అటకెక్కించాడు. దాన్ని మళ్లీ పునరుజ్జీవింప చేయాలంటే అంత సులభం కాదు. పైగా ఆయనకు జెఎసికి మధ్య సత్సంబంధాలు లేవు. ఉద్యమాన్ని తన చేతిలోకి తీసుకోవడానికి బిజెపి నేత కిషన్‌రెడ్డి ఒక ప్రక్క, మాజీ తెలుగుదేశం నేత నాగం జనార్దన్ రెడ్డి వంటివారు మరొకప్రక్క ప్రయత్నం చేస్తున్నారు. కెసిఆర్‌తో సహకారానికి వారు సిద్ధంగా లేరు. కాంగ్రెస్ నేతల సంగతి తెలిసిందే. కుక్క చింపిన విస్తరి వలె వుంది ఆ పార్టీ. ఈ నేపథ్యంలో ఇప్పుడు తెలంగాణ అంశం భగ్గుమనబోతున్నది. ఇటువంటి ఉద్యమాలు ఏక నాయకత్వంలో నడిస్తే ఒక పద్ధతి వుంటుంది. ఎవరికి తోచిన దారిలో వారు దాన్ని మళ్లించాలని చూస్తే అరాచకంగా మారుతుంది.

ఇదిట్లా వుంటే తెలంగాణ ఇవ్వని దానికి పరిహారంగా ఒక తెలంగాణ నేతకు రాష్ట్రం పగ్గాలు అప్పచెప్పే ఆలోచన కూడా కేంద్ర నాయకత్వంలో వున్నట్లు వినికిడి. మర్రి శశిధర్‌రెడ్డిని అందుకు ముస్తాబు చేసి, బాసికాలు కడుతున్నారట. ఆయన చాలా గుంభనంగా వుండడానికి, రాష్ట్రంలో ఎవరితోనూ ఏ విధమైన సంపర్కం లేకుండా గడపడానికి అదే కారణమని చెప్తున్నారు. తెలంగాణ ప్రకటన చేయబోయే ముందు గానీ, ఆ వెంటనే గానీ కిరణ్ నుంచి రాజీనామా కోరవచ్చునని వదంతి. అదెంత వరకు నిజమో తెలియదు. మొత్తం మీద రానున్న ఒకటి రెండు వారాలు రాష్ట్ర రాజకీయాలు వేడి వేడిగా వుండబోతున్నాయి.

## అక్బరుద్దీన్

8వ పేజీ కొరవ

పార్టీ పోటీ చేయదు. ఆ రాష్ట్రంలో ఆ పార్టీకి ఉనికి లేదు. శాసనసభలో సీట్ల కంటే మిన్నగా ఏదో కుత్సితం అక్బరుద్దీన్ ఒవైసీలో దాగి వున్నదని అనుమానించడానికి ఆధారాలు కన్పడుతున్నాయి.

### కసబ్‌ది ఆత్మ త్యాగమా?

ఎంతో కరుడు గట్టిన మత ఛాందస వాదులు కూడా అమాయక ప్రజల రక్తంతో మడుగులు సృష్టించే కిరాతక తీవ్రవాదులను సమర్ధించరు. కానీ అక్బరుద్దీన్ మాత్రం బొంబాయి నగరంలో నరమేధానికి కారకుడైన కసాయి కసబ్‌ను కీర్తించాడు. ఆ పసిబాలుడిది ఆత్మత్యాగం అన్న ధోరణిలో ప్రసంగించాడు. కుల, మత, వర్గ, ప్రాంత బేధాలు లేకుండా జాతి యావత్తూ నిరసించిన ఆ క్రూర హింసాకాండను పరోక్షంగా అయినాసరే సమర్థించడం అంటే దేశ ద్రోహ నేరంతో సమానమౌతుంది. ఆ తప్పును నిర్భయంగా చేశాడు అక్బర్. తన ప్రసంగంలో ఆ అంశానికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చాడు. నరేంద్ర మోడిని, కసబ్‌ను ఒకే గాట కట్టాడు. కసబ్‌తో సమానంగా నరేంద్ర మోడిని ఎందుకు ఉరి తీయరని అరిచి కేకలు పెట్టాడు.

### తెలంగాణ కారణమా?

కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు సన్నద్ధమౌతున్నదనే వార్తలొస్తున్నాయి కాబట్టి, దాన్ని అడ్డుకోవడానికి మత ఉద్రిక్తతలు సృష్టించడం ఈ ప్రసంగానికి ఒక కారణమనే వాదన విన్పిస్తున్నది. తెలంగాణ ఇస్తే ఆ ప్రాంతంలో మత సామరస్యం ధ్వంసం అవుతుందని శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఇవ్వడం, తెలంగాణ ఏర్పడితే బిజెపి బలపడి పోతుందని మజ్లిస్ పార్టీ అగ్రనేత అసదుద్దీన్ ఒవైసీ పలు మార్లు ప్రకటనలు చేయడం ఈ అభిప్రాయానికి కారణం కావచ్చు. అయితే అక్బర్ ప్రసంగానికి తెలంగాణ అంశం ఒక్కటే కారణమన్పించడం లేదు.

అంతకంటే దీర్ఘమైన ఆలోచన, అంతకుమించిన లక్ష్యం ఏదో మజ్లిస్ పార్టీ మనసులో వున్నదని భావించాలి. అదేమిటో ఈ దశలో చెప్పడం కష్టం.

### తాతలనాటి అలవాటు

మత విద్వేషాలు రెచ్చగొట్టడం ద్వారా రాజకీయంగా బలపడాలనే దుష్ట పన్నాగాలు మజ్లిస్ పార్టీకి మొదట నుంచీ అలవాటే. 1921లో అప్పటి నిజాం రాజ్యంలో ప్రధాన మంత్రిగా పని చేసిన నవాబ్ బహదూర్ యార్ జంగ్ స్థాపించిన పార్టీ అది. ఆయన మరణం తర్వాత ఖాసిం రజ్వి పెత్తనం తీసుకొన్నాడు. నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా తెలంగాణ రైతాంగం జరిపిన సాయుధ పోరాటాన్ని అణిచి వేయడానికి రజాకార్ల పేరుతో ప్రైవేట్ సైన్యం తయారు చేసి, వేలాది మందిని ఊచకోత కోసిన కిరాతకుడు ఖాసిం రజ్వి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పాకిస్తాన్‌కు పారిపోయాడా క్రూర రాక్షసుడు.

ఆయన స్థానంలో మజ్లిస్ పార్టీ సారథ్యం వహించింది, అక్బర్ తాత మౌలానా అబ్దుల్ వాహిద్ ఒవైసీ. ఆయన పచ్చి మతతత్వవాది. ఇప్పుడు అక్బర్ మాట్లాడిన తరహాలోనే వాహిద్ కూడా పాతబస్తీలో సభలు పెట్టి, హిందువులను చంపమని ప్రేరేపిస్తూ ఉద్రేక పూరిత ప్రసంగాలు చేసేవాడట. దానితో ఆనాటి ప్రభుత్వం ఆయన్ను అరెస్టు చేసి జైలులో పెట్టింది. 1958 మార్చి నెల 24తేది నుంచి పది నెలలపాటు జైలు శిక్ష అనుభవించాడు వాహిద్ ఒవైసీ. ఆయన తర్వాత అక్బర్ తండ్రి సలావుద్దీన్ ఒవైసీ మజ్లిస్ పార్టీ నేతృత్వం వహించాడు. సలావుద్దీన్ ఒవైసీ పాత బస్తీ ముస్లింలకు ఆరాధ్యనేతగా గుర్తింపు పొందినప్పటికీ, ఎప్పుడు కూడా ఇంతటి తీవ్ర పదజాలంతో మత విద్వేషాలు రెచ్చగొట్టే ప్రయత్నం చేయలేదు. అయితే పాత బస్తీ మత ఘర్షణల వెనుక ఆయన పరోక్ష ప్రమేయం వుండేదని మాత్రం చెప్తారు. దీని అర్థం, ఒవైసీ కుటుంబానికి మత విద్వేషాల ప్రేరేపణ తాతల నాటి అలవాటన్న మాట.

### హైకోర్టు అభిశంసన

అక్బర్ ప్రసంగాల తీరుపై హైకోర్టు న్యాయమూర్తి తీవ్రస్థాయి అభిశంసన ప్రకటించాడు. పదిహేను నిముషాల పాటు పోలీసులను పక్కనపెడితే హిందువులందరినీ చంపుతావా, అయితే అరగంట సమయం ఇస్తాను ఎంత మందిని చంపుతావు అని ప్రశ్నించాడు న్యాయమూర్తి. రాజకీయ కుటుంబం నుంచి వచ్చి, బాధ్యత కల్గిన ప్రజాప్రతినిధిగా వుంటూ ఇటువంటి విషపూరిత ప్రసంగాలు చేయడం పట్ల తీవ్రమైన ఆవేదన వ్యక్తం చేసింది హైకోర్టు.

### ప్రభుత్వం సాహసం చూపింది

సాధారణంగా సున్నితమైన మత పర అంశాలలో నిర్ణయాలకు వెనుకడుగు వేసే రాష్ట్ర ప్రభుత్వం అక్బర్ విషయంలో మాత్రం సాహసోపేతంగా వ్యవహరించింది. అక్బర్‌ను అరెస్టు చేయడం పాతబస్తీలో ఉద్రిక్తతలకు కారణం అవుతుందని తెలిసి కూడా, ప్రజల నుంచి ఒత్తిడి తట్టుకోలేక అరెస్టు చేసి, ఆదిలాబాద్ జైలుకు పంపింది. అన్ని సమయాలలో అన్ని విషయాలలో ప్రభుత్వం, పోలీసులు చట్టాన్ని కఠినంగా అమలు చేస్తే అక్బర్ వంటి రాజకీయవాదులు తమను తాము అదుపులో పెట్టుకొంటారు. ఆ భయం లేకపోవడం వల్లనే వీరిట్లా రెచ్చిపోతున్నారు. అయితే అక్బర్ అరెస్టు విషయంలో చూపిన మనోస్థైర్యాన్ని, తదనంతర పరిణామాలలో కూడా ప్రదర్శించవలసిన అవసరం ప్రభుత్వానికి ఎంతో వుంది. ఈ ప్రసంగాన్ని సాకుగా చూపి సమాజంలో మత సామరస్యాన్ని చెడగొట్టే ప్రయత్నం ఏది జరిగినా కఠినంగా అణిచి వేయడం తప్పనిసరి. అటువంటి కుట్రలు, పన్నాగాలను మొగ్గలోనే తుంచివేయాలి. బిజెపి, భజరంగదళ్, విశ్వహిందు పరిషత్ వంటి సంస్థల విషయంలో అప్రమత్తంగా వుండాలి. వారే మాత్రం దీన్ని చిలికి చిలికి గాలివానగా మార్చడానికి యత్నించినా అణిచి వేయాలి. అప్పుడే సమాజంలో మత సామరస్యం సజీవంగా పరిఢవిల్లగలుగుతుంది.

## వివేకా ఆరోగ్యం

మొదటి పేజీ కొరవ

కోరుకొన్నాడు వివేకా. కానీ తుంటి ఎముక నొప్పి భరించశక్యం కాని రీతిలో బాధ పెడుతుండడంతో ఆ ఆలోచన మానుకొన్నాడు. మరొక రెండు లేదా మూడు నెలలపాటు హైదరాబాదులోనే వుండి విశ్రాంతి తీసుకోవాలని డాక్టర్లు సలహా ఇచ్చినట్లు తెలుస్తున్నది.

కాలుగాలిన పిల్లి వలె క్షణం ఇంటి పట్టున వుండకుండా వీధులలో తిరగడాన్ని ఇష్టపడే వివేకాకు ఈ విశ్రాంతి జీవితం పెద్ద శిక్ష క్రింద లెక్క. ఆయన తర్వగా కోలుకొని మళ్లీ మామూలు మనిషిగా మన మధ్యలో మెలగేట్లు చూడమని ఆ భగవంతుడిని కోరుకొంటున్నాము.

## సంక్రాంతి

9వ పేజీ కొరవ

మైనప్పుడు భూమి సముద్రంలో మునిగిపోయినపుడు విష్ణుమూర్తి ఆది వరాహరూపంలో భూమిని నీళ్లలో నుంచి పైకి తెచ్చింది ఉత్తరాయణ కాలంలోనేనని విష్ణుపురాణం చెబుతోంది. మహాభారత యుద్ధంలో పోరాడి అస్త్రసన్యాసం చేసి మృత్యు ఒడిలోకి చేరువలో వున్న భీష్మపితామహుడు ఈ ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చే వరకు ప్రాణాలను నిలుపుకొని అంపశయ్యపై వుండి ఆ తర్వాత ప్రాణత్యాగం చేశాడని భీష్మపర్వం తెలుపుతోంది. శ్రమకు, సంపదకు గొప్ప స్థానమిచ్చే సంక్రాంతి పండుగను అందరూ ఘనంగా జరుపుకొంటారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

వాసులురెడ్డి కలసి జిల్లాలో పార్టీ నిర్మాణాత్మక కార్యక్రమాలను సమన్వయం చేస్తారు. పార్టీలో పెరిగిన గ్రూప్ రాజకీయాలకు చెక్ పెట్టనే ఈ నియామకమంటున్నారు. ఈ వ్యవహారంలో నిజానిజాలు జగన్మోహన్‌రెడ్డికే ఎరుక?

## బాలుకు స్వల్ప అస్వస్థత

విఖ్యాత గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం స్వల్ప అస్వస్థతకు గురయ్యాడు. ఆయన సారధ్యంలో నిర్వహిస్తున్న కార్యక్రమం పాడుతాతీయగా విశేష ఆదరణ లభిస్తున్న విషయం తెలిసిందే. ఈసారి చిన్నారులతో చేస్తున్న పోటీలను కస్తూరిబా కళాక్షేత్రంలో ఏర్పాటు చేశారు. అందుకోసం ఎస్పీ బాలు నగరానికి విచ్చేసి రెండురోజులు కార్యక్రమంలో పాల్గొన్నారు. మూడో రోజు స్వల్పంగా అనారోగ్యానికి గురి కావడంతో కార్యక్రమాన్ని రద్దుచేశారు.

## సన్నపరెడ్డి దశరథరామరెడ్డి మరణం



న్యాయవాదిగా, న్యాయమూర్తిగా ఉన్నత ప్రమాణాలు, అత్యున్నత ప్రతిభా పాటవాలకు ఆనవాలుగా ప్రతిష్ట సంపాదించిన హైకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి సన్నపరెడ్డి దశరథరామరెడ్డి గారు 6 తేది హైదరాబాదులోని స్టార్ ఆస్పత్రిలో కన్నుమూశారు. ఆయన వయస్సు 77 సంవత్సరాలు.

దశరథరామరెడ్డి గారిది ఉత్కృష్టమైన న్యాయ జీవితం. ప్రఖ్యాత న్యాయవాది, మాజీ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మాధవరెడ్డి గారి పర్యవేక్షణలో 1962లో న్యాయవాదిగా జీవితం ఆరంభించిన దశరథరామరెడ్డి గారు చివరివరకు న్యాయ ప్రమాణాలకు కట్టుబడి జీవించారు. ఆదాయ పన్ను, వాణిజ్య పన్నుల చట్టాలను ఔపోసన పట్టినవాడాయన. ఆ వివాదాలలో దశరథరామరెడ్డి గారు కేసు చేపడితే గెలవడం ఖాయం అన్న పేరు ఉండేది. 1993లో హైకోర్టు న్యాయమూర్తిగా నియమితులై, నాలుగేళ్లపాటు పని చేశారు. ఆ పదవికి వన్నె తెచ్చిన అరుదైన న్యాయశీలులలో ఆయన ఒకరని నిర్ద్వందంగా చెప్పవచ్చు.

దశరథరామరెడ్డి గారిది బహుముఖ వ్యక్తిత్వం. న్యాయవాదిగా ఉంటూనే శాస్త్రీయ సంగీతం, వేదాంతం వంటి అంశాలలో లోతుగా నిమగ్నమయ్యే వాడు. చిన్మయ మిషన్‌కు చాలా కాలం నేతృత్వం వహించాడు. మహావీర్ ఆస్పత్రి నైతిక ప్రమాణాల కమిటీకి సారధ్యం వహించాడు. ఆయన మంచి రచయిత కూడా. మన రాష్ట్రంలో సహకార సంస్థల చట్టానికి ప్రామాణికమైన వ్యాఖ్యానం రచించారు. హైదరాబాదులో వృద్ధుల కోసం ఆశ్రమాలు నడిపే సంస్థను స్థాపించారు.

దశరథరామరెడ్డి గారిలో ప్రసన్న వదనం, ముక్కు మీద కోపం రెండూ సమ్మిళితంగా కన్పించేవి. నెల్లూరు అన్నా, నెల్లూరీయులన్నా ఆయనకు ఎనలేని ప్రేమ. ఆయన స్వగ్రామం కోవూరు. అక్కడి వారితో చివరి వరకు నిత్య సంబంధాలు నెరపేవారు. ఆయన కుమారుడు ద్వారకానాధ్‌రెడ్డి కూడా పేరున్న న్యాయవాది. వారి కుటుంబానికి మా సంతాపం తెలియజేస్తున్నాము.

## పదరంగం -50

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | | 4 | | | 5 | 6 |
| 7 | | | 8 | 9 | 10 | | | 11 | | |
| | | | | 12 | | | | 13 | | |
| | 14 | | 15 | | | | 16 | | | 17 |
| 18 | | 19 | | | | 20 | | | 21 | |
| 22 | | | | 23 | | | 24 | 25 | | |
| | | 26 | 27 | | | 28 | | 29 | | |
| 30 | | | | | 31 | | | | | |
| | | 32 | | 33 | | | | | | |
| 34 | | | 35 | | 36 | | | | | |
| | | 37 | | | | | | | | |

**అడ్డం**

1. సమభావం, సఖ్యత (4)
4. ప్రత్యేక పూజ, సమారాధన (2)
5. వాక్కు, బ్రహ్మపత్ని (2)
7. డబ్బు (2)
8. తెలుగు అడ్జస్ట్‌మెంట్ దిద్దుబాటు (4)
11. అటునుంచి సందడి, సంబరం (3)
12. అర్ధభాగం (3)
13. అటునుంచి కవిత్వం వ్రాసేవాడు (2)
15. తడబడిన పడతి (3)
16. తల్లి, అమ్మ (2)
18. చులకన, చిన్నతనం (3)
20. ప్రఖ్యాతి, సిరి, నివాసస్తుడు (2)
21. నెహ్రూతో మన చుట్టరికం (2)
22. పెద్ద కథ (3)
23. ప్రయాణం (2)
24. ఆందోళన (4)
26. పెసరపప్పుతో వండిన అన్నం (3)
29. వేగం (2)
30. 'ప' గుణింతంతో చిన్నపిల్ల (2)
31. తెలుగు లగ్జరీ, చిరునామా (4)
33. కుంకుడుకాయ తోటిదే (3)
34. గాలి, వాయువు (4)
36. అటునుంచి రక్తనాళం (2)
37. తెలుగు అకౌంట్ ఆవర్జాతోటిదే (2)

**నిలువు**

1. ప్రాక్టీసు, శ్రమ (3)
2. మీరు – మేము కలసి (2)
3. ధాన్యం (2)
4. గడ్డ, గాయం (3)
5. అలవాటు (3)
6. నది పాయ, జడ క్రింద నుంచి (2)
9. నివసించే చోటు (3)
10. గొడవ (3)
11. కవి వ్రాతలు (3)
14. తెల్లవారుజాము (3)
16. అతుకు, మరక (3)
17. సాంప్రదాయం (3)
19. ప్రేమ (3)
21. వసారా (3)
23. యజ్ఞంతో పాటిదే (2)
25. భిన్నంలో పైన ఉండేది (2)
27. లచ్చి అసలు పేరు (2)
28. పారిపోవడం (5)
30. క్షీరాన్నము (4)
31. అసహ్య భావన (3)
32. మిర్చి (3)
35. చుంబనం (3)

**సమాధానాలు**

## పదరంగం -49

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]ఆ | మో | [2]దం | | | [3]త | [4]ద | నం | [5]త | ర | [6]ము |
| వే | | [7]డ | [8]జ | [9]ను | | ది | | ట | | క్కు |
| ద | | [10]న | వ | లో | [11]కం | | [12]వా | స్త | వం | |
| [13]న | [14]వా | | రా | | [15]చ | [16]రి | త | ము | | [17]వి |
| | [18]ర | [19]కా | లు | | [20]ము | క్త | ము | | [21]కా | మా |
| [22]వా | సు | కి | | | | | | [23]ము | ర | న |
| [24]తా | డు | | [25]గ | | [26]అం | కు | [27]రా | ర్ప | ణ | ము |
| వ | | [28]కో | రి | [29]క | | | [30]మీ | స | ము | |
| ర | | [31]మ | క | రి | | [32]స | | | | [33]వృ |
| [34]ణం | [35]వ | ల | | | [36]తా | త్కా | లి | [37]కం | | శ్చి |
| | [38]ద్దు | ము | | [39]పా | వు | రం | | [40]చు | బు | కం |

# సంక్షిప్త సింహపురి

## మాసమంతా పురాణ ప్రవచనం!

ఐదవ నెంబర్ జాతీయ రహదారిపై వెంకటాచలం సమీపంలో రిలయన్స్ పెట్రోల్ బంకుకు ఎదురుగా ఉండే శ్రీ ప్రసన్న వెంకటేశ్వరస్వామి దేవస్థానంలో జనవరి 1వ తేది నుంచి 31వ తేది వరకు ప్రతిరోజు సాయంత్రం పురాణ ప్రవచన కార్యక్రమం జరుగుతుంది. తిరుమల తిరుపతి దేవస్థానం – హిందూ ధర్మ ప్రచార పరిషత్ ఆధ్వర్యంలో పురాణ పండితులు జి.చెంచులక్ష్మి పురాణ ప్రవచనం చేస్తున్నారు. ప్రతినిత్యం విష్ణు సహస్ర నామ పారాయణ కూడా ఉంటుందని దేవస్థాన నిర్వాహకులు తెలియ జేస్తూ భక్తులను ఈ కార్యక్రమంలో పాల్గొనమంటున్నారు.

## పొగమంచుతో తంటా!



జనవరి 1వ తేది నుంచి నెల్లూరును పొగ మంచు కప్పేస్తుంది. రాత్రి 11 గంటల నుంచి ఉదయం 8 గంటల వరకు బాగా మంచు తెర కప్పేస్తుండడంతో ఎదురెదురుగా వచ్చే మనిషి, వాహనాలను రోడ్లపై గుర్తించడం కష్టంగా ఉంది. రాత్రిపూటనైనా వాహనాలను లైట్ల వెలుతురులో నడపవచ్చు కానీ పొగమంచులో నడపడం గగన కుసుమం అవుతుంది. మంచు మూలంగా ఈ పండుగ నెలలో వాకిళ్ల ముందు ముగ్గులు వేయను మహిళలు బయటకు రాలేక పోతున్నారు. మంచు మూలంగా చిన్నా పెద్దా తేడా లేకుండా పలువురు అస్వస్థులవుతున్నారు. పెద్ద పండుగ వెళ్తేగానీ ఈ పొగమంచు తగ్గేట్లు లేదు.

## తిరుప్పావై ప్రవచనాలు!



నెల్లూరు రాయాజీ వీధిలోని ఆంజనేయస్వామి దేవస్థానంలో డాక్టర్ రామ చంద్రుని రమేష్‌కృష్ణ చేస్తున్న తిరుప్పావై ప్రవచనాల ప్రచారం ఆధ్యాత్మిక జిజ్ఞాసులను ఆకట్టుకొంటుంది. జనవరి 14వ తేది వరకు ఈ కార్యక్రమం కొనసాగుతుంది. వయస్సులో చిన్నవాడైనా రమేష్ కృష్ణ విదేశాల్లో సైతం ఆధ్యాత్మిక ఉపన్యాసాలిచ్చిన అనుభవం ఉంది. ఆధ్యాత్మికత అంటే ఏమిటి? ఏది ధర్మం? ఏది అధర్మం? దేవుడిపై అనురక్తి అంటే జీవితం మీద విరక్తా? భక్తి మార్గం వల్ల ముక్తి లభిస్తుందా? సనాతన ధర్మం ఏమిటి? శరణాగతి ఎందుకు చేయాలన్న అంశాలపై రమేష్ చేస్తున్న ఉపన్యాసాలు వినాలపిస్తున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం సౌజన్యంతో ఈ కార్యక్రమం జరుగుతుంది.

## విద్యాశాఖను ప్రక్షాళన చేయాలి!



జిల్లాలో విద్యాశాఖను ప్రక్షాళన చేయాలని సీమాంధ్ర యువజన విద్యార్థి జాయింట్ యాక్షన్ కమిటీ 4వ తేది నెల్లూరు పినాకినీ అతిథి గృహంలో రాష్ట్ర ప్రాథమిక విద్యాశాఖా మంత్రి శైలజనాథ్‌ను కలసి వినతి పత్రం సమర్పించింది. ఈ సందర్భంగా జెఎసి కన్వీనర్ ముక్కు రాధాకృష్ణ గౌడ్ మాట్లాడుతూ జిల్లాలో విద్యా వ్యవస్థను డిఇఓ మువ్వా రామలింగం, కార్పొరేట్ స్కూళ్ల యాజమాన్యాలు, కలికాలంలోని ప్రభుత్వ ఉపాధ్యాయులు కలసి అధోగతి పాలు చేస్తున్నారని; కంచే చేను మేసే చందంగా డిఇఓ అవినీతి అక్రమాలు తారాస్థాయికి చేరాయన్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయులు స్కూళ్లకు డుమ్మా కొడుతూ సొంత వ్యాపారాలు చేసుకొంటూ జల్సాలలో మునిగి తేలుతున్న వ్యవహారంపై దర్యాప్తు జరిపించాలని రాధాకృష్ణ గౌడ్ డిమాండ్ చేశారు.

## కొక్కరకో అంటున్న కోడి మాంసం!




పెద్ద పండుగకు ముందే కోడి మాంసం ధరలు కొక్కరకోమంటున్నాయి. కోడి మాంసం అమ్మకాలు మొదలైన తర్వాత ఎప్పుడూ లేనట్లుగా చర్మం లేకుండా మాంసం కిలో ధర 185 రూపాయలు పలుకుతుంది. గత ఏడాది ఈ ధర పెరుగుదల 178 రూపాయలు దగ్గర ఆగినా ఈ యేడాది మరో ఏడు రుపాయలు పెరగడం విశేషం. అదేమి విచిత్ర మోగానీ అంత ధర పలుకుతున్నా చికెన్ తినడం జనం మానడంలేదు. నెల్లూరు నగరంలో వందలాది చికెన్ స్టాల్స్ ఉన్నాయి. ఓ ఐదారు మినహా మిగతా చోట్ల క్వాలిటీ చికెన్ కూడా లభించడం లేదు. మునిసిపల్ ఆరోగ్య శాఖాధికారులు లంచంగా చికెన్ తినడమే కానీ దాని నాణ్యత మాత్రం చూడడం లేదు.



రైతు లోకం

## వరిలో అగ్గి తెగులు, పాముపొడ తెగులు - నివారణ!

మన జిల్లాలో ప్రస్తుతం వరిపంట ఎక్కువగా పిలక దశ నుంచి చిరుపొట్ట దశ వరకు వున్నది. ఈ దశలో వున్న వరి పైరులో అక్కడక్కడా అగ్గి తెగులు, పాము పొడ తెగులు గమనించటం జరిగినది. వీటి నివారణకు ఈ క్రింది సూచనలు పాటించాలి.

### అగ్గి తెగులు

ఆశించిన మొక్కల ఆకులపై ముదురు గోధుమ రంగు అంచుతో మధ్యలో బూడిద రంగు గల నూలు కండె ఆకారపు మచ్చలు, ఆకులు ఎండిపోయి తగులబడినట్లు కన్పిస్తాయి. నత్రజని ఎక్కువైనప్పుడు తెగులు త్వరగా అభివృద్ధి చెంది ఎక్కువ నష్టం కలుగజేస్తుంది.

### నివారణ

ఈ తెగులు నివారణకు ట్రైసైక్లోజల్ 0.6 గ్రాములు లేదా ఐసోప్రోథయొలేన్ 1.5మిల్లీ లీటర్లు లేదా కాసుగామైసిన్ 2.5మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పైరుపై పిచికారి చేయాలి.

### పాము పొడ తెగులు

ఈ తెగులు దుబ్బు చేసే దశ నుండి కాండం ఆకులపై మచ్చలు ఏర్పడి, పెద్దవై పాము పొడ మచ్చలుగా ఏర్పడతాయి. ఈ తెగులు కూడా నత్రజని ఎరువులు ఎక్కువైనప్పుడు తెగులు త్వరగా అభివృద్ధి చెంది ఎక్కువ నష్టం కలుగజేస్తుంది.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

### నివారణ

సిఫారసు చేసిన నత్రజనిని 3-4సార్లు



వేసి, గట్లపైన, చేనులోనూ కలుపు లేకుండా చూసుకోవాలి. నివారణకు హెక్సాకోనజోల్ 2 మిల్లీలీటర్లు లేదా ప్రోపికోనజోల్ 1 మిల్లీలీటర్లు లేదా వాలిడామైసిన్ 2 మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com